# సాంప్రదాయిక విజ్ఞానం

## మొదటి భాగం

## ( పాత పాటలు )



ఏటుకూరి కామేశ్వరరావు

నవ్యసాహిత్య పరిషత్తు
గుంటూరు

# తొలిపలుకు

మిత్రులు శ్రీ కామేశ్వరరావుగారి పాతపాటలు అనే పుస్తకానికి తొలిపలుకు చెప్పే అదృష్టము నాకు కాకతాళీయముగా కలిగింది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి దక్కవలసిన గౌరవము నా వేపు తిరిగింది.

ప్రతి గ్రంథానికి ఉపోద్ఘాతము అనేది ఉండటము లాంచనము. కామేశ్వరరావుగారు కూడా ఆ సాంప్రదాయము తప్పించటానికి యిష్టము లేక ఈ పని పెట్టేరని తోస్తుంది. కావలసినంత విషయ సమీక్ష కామేశ్వరరావుగారి "సాంప్రదాయిక విజ్ఞానము" అనే వ్యాసమే ఇస్తోంది. కూర్పరి తన ఆశయాన్ని వెల్లడి చేస్తూ కర్తవ్యము కూడా సూచించినాడు.

సాంప్రదాయిక విజ్ఞానము నశించకుండా పొందుచేసుకోడం నాగరికతా లక్షణమని నా ఉద్దేశము. ఈ విజ్ఞానాన్ని సేకరించి భద్రపరచటానికి అనేకవిధాల శ్రమలకి లోబడవలసివస్తుంది. ఈ ప్రయత్నము ఈసంపాదకుడు చెప్పినట్టు, సంఘం అంతా కలసి చేయవలసినపని కాని ఒక్క వ్యక్తివల్ల సాధ్యమయ్యేదికాదు. ప్రతివ్యక్తి బాధ్యత గుర్తించి కృషిచేస్తే ఈ కార్యక్రమము సమగ్రంగా నెరవేరుతుంది. పత్రికాధిపతులు ఈ ఉద్యమానికి ప్రోత్సాహమివ్వాలి.

కావ్యంలో భాష, భావము రెండూ నిర్దుష్టముగా వుంటేనే అది ఉన్నతశ్రేణికి చెందుతుంది. భాష భావాలకి అనుగుణంగాను సందర్భోచితంగాను వుంటేనే కావ్యము రంజిస్తుంది. వ్యాకరణ సూత్రాలతో మేకుబందీచేసిన భాష అవసరమని ఏమాత్రము నా ఉద్దేశముకాదు. భావముయొక్క స్థాయి ననుసరించిఉంటే, కవిహృదయాన్ని వ్యక్తపరుస్తుంది.

ఇక భావము అనేది—కావ్యవస్తువు ఏ తరగతి సంఘానికి చెందితే దానికి అనుగుణంగా ఉండాలి. చిన్నపిల్లలని ఉద్దేశించి చెప్పేసందర్భ

ములో జటిలమైన అలంకారాలు, భావ ఏమి ఉపయోగిస్తవి? అలా కాకుండా వాళ్ళకి అందుబాటులో వుండేట్టు ప్రసంగిస్తే కవి కృత కృత్యుడు అవుతాడు.

ప్రస్తుతం ఈగ్రంథకర్త అనేక పాతపాటలను సేకరించి నేర్పుతో వర్గీకరణముచేసి జనబాహుళ్యానికి అందజేస్తున్నారు. ఈ గ్రంథంలో ఉన్న మొదటి రెండు ఖండాలలోను జోలపాటలు, ఆటపాటలు, పనాతి పాటలు, మిశ్రమములు అనేక రకాలు వున్నాయి. మూడో ఖండంలో మాత్రము ఇలాంటివిభజన లేదు. దానికి కారణము సంఖ్య తక్కువగా వుండటం అని తోస్తుంది. ఈ పాట లన్నిటిలోను తెలుగునాటి తెలుగుల నిత్యజీవితము ద్యోతకవుతోంది. తేనె తెనుగు నిరాటంకముగా ప్రవిస్తోంది. ఈ పాటలు తెలుగుతల్లులు నేర్చేవుంటారు. కాని నాగరికతావిజృంభణమువల్ల ఇలాంటి అమూల్యమైన సారస్వతము వెనక బడకుండా వుండటానికి ఈ ప్రయత్నము. ఈ పాటలు అనేకచోట్ల నుండి సేకరించినవి కాబట్టి ఒక్కొక్కదానికి ప్రత్యేకశీర్షిక లేదు. కొన్ని అసంపూర్తిగాకూడా ఉన్నాయి. కాని ఈ సారస్వతము బాగా వృద్ధిపొందాలి. నేదునూరి గంగాధరం మొదలైనవారు ఇప్పటికే కామేశ్వరరావుగారి ప్రోత్సాహమువల్ల చాల కృషి చేస్తున్నారని తెలుస్తూంది. మొదటి రెండుఖండాలలోవున్న తెనుగుకి చివర ఖండంలోవున్న తెనుగికి కొంచెం భేదము కనుపిస్తోంది. దీనికి కారణము మూడోఖండంలోని పాటలు తెలింగాణములో స్వీకరించినట్లు గ్రంథకర్త సూచించాడు. అందుకనే తెలింగాణా తెలుగు ఛాయలు ఈ పాటలలో అక్కడక్కడ తొంగిచూస్తున్నాయి.

ఈ పాటల్లో రసౌన్నత్యానికి ప్రధానమైనపంక్తులు ఉదహరించాలంటే మొత్తము గ్రంథమంతా ఉదహరించవలసి వస్తుంది. ఈ ఖండిక లన్నింటిలోను నాజూకు అయిన భావాలు హృదయానికి నాటేభాషలో కవితా సౌరభాన్ని వెదజల్లుతున్నాయి. కనుక సొంపైన భావాలు, ఇంపైన భాష అంటే సరిపోతుంది.

ఈ గ్రంథంలో ఇంకో ప్రత్యేకత. చివర టిప్పణము చేర్చి ప్రస్తుతము వాడుకలో లేని చాలా ప్రయోగాలకి అర్థము సాధించారు. ఇలా చేయటము చాలా అవసరము. ఇటువంటి పుస్తకములను అలాగు ప్రచురించిననే ఎక్కువ ఉపయోగము. కాలప్రవాహంలో అడుగున బడిపోతూన్న అమూల్య సారస్వతాన్ని అతి శ్రద్ధతోను, ఓపికతోను ఏమాత్రము ప్రతిఫలాపేక్ష లేకుండా పొందుపరుస్తున్నందుకు ఆంధ్రులు కామేశ్వరరావు గారికి కృతజ్ఞులు. ఇలాంటి సారస్వతము ప్రచురించటానికి. ఈగ్రంథకర్తయే ప్రథములని తోస్తుంది 1929 లో ఈలాంటి పాటలను 'భారతి' లో వీరు సాహసించి ప్రకటించారు. దానితర్వాతే పత్రికల్లో యితరులు కూడ ప్రచురిస్తూ వచ్చేరు: ఇందులో మొదటి ఖండము మాత్రము 1930 లోనే పుస్తకాకారంలో వెలువడింది. ఆ ప్రతులు మచ్చుకైన లేకపోవటంచేతను యింకా క్రొత్తవాటిని గ్రంథకర్త సేకరించటంతోను శ్రీ కామేశ్వరరావుగారు ఈ గ్రంథాన్ని ఆంధ్రదేశానికి అందజేస్తున్నారు. ఇలాంటి గ్రంథాలు ఇంకా వెలువడటము కామేశ్వరరావు గారి కృషికి సరియైన సత్కారము.

ఏలూరు,
18—5—41

రాయప్రోలు సుబ్రహ్మణ్యము

# అంకితం

ఆంధ్రపరిశోధకులైన

**కీ. శే. జయంతి రామయ్యపంతులుగారికి**

# సాంప్రదాయిక విజ్ఞానం *

ఇప్పటి నాగరికజాతులన్నీకూడా ఒకప్పుడు బహు అనాగరికంగా ఉండేవి. ఆ అనాగరికస్థితిలో అవి కొంతజ్ఞానం సంపాదించాయి. ఆ జ్ఞానం ఒకతరంవారినుంచి మరొకతరంవారు నేర్చుకొంటూవచ్చినందు వల్ల అది ఇప్పటికీ నిలచిఉంది. ఈ జ్ఞానానికే అటుతర్వాతివారుకూడా కొంతకొంత చేరుస్తూవచ్చారు. మొత్తంమీద ఈ జ్ఞానానికి సాంప్రదాయికవిజ్ఞానం (Folk Lore) అని పేరు.

సంఘంయొక్క శైశవస్థితిలో ఆర్జించిన ఈ జ్ఞానంలో సవ్యమైన కార్యకారణసంబంధం ఉండదు, ఒక్క వాఙ్మయాంశం తప్ప విడిచి. ప్రకృతిశాస్త్రాదుల విషయమై వారికి కల జ్ఞానం బహుస్వల్పం. అంతేకాకుండా ఆఉన్న కాస్తజ్ఞానమైనా ప్రకృత్యతీతకారణాలతో నిండిఉంటుంది.

ఈ సాంప్రదాయికవిజ్ఞానం నాగరికజాతులలో ఇంకాకూడా నిలచిఉంది. దానికి కారణం జాతిఅంతా నాగరికం కాకుండా కొంత భాగంమాత్రమే నాగరికమవడం. తక్కిన అనాగరికభాగంకూడా క్రమేపీ నాగరికమవడంతోటే ఈ విజ్ఞానం సంఘంలో మచ్చుకేనా లేకుండా పోతుంది.

సంఘంయొక్క శైశవస్థితిలో పుట్టిన, ఈ జ్ఞానాన్ని ఇంచుమించుగా అజ్ఞానమనే చెప్పవచ్చు. అటువంటి అజ్ఞానం క్రమేపీ నశించిపోతూన్నందుకు మనము విచారించాలా అంటే — నిజంగా మనం ఏమాత్రమూ విచారించనవసరంలేదు. సంఘం క్రమేపీ నాగరికమవుతూన్నందుకు మనమంతా సంతోషించవలసిందే. కాని నాగరిక

---

*గ్రంథకర్త రచించిన 'సాంప్రదాయిక విజ్ఞాన' మను నీవ్యాసము 1933 డిసెంబరు 'భారతి'లో ప్రకటించబడింది.

స్థితిఅంటే వెనుకటి మనసంగతులన్నీ మరచిపోవడంకాదు. అలా మరచి పోవడమే మరొక రకమైన అనాగరికత అని అనుకోవచ్చు. అలాగు గాక అప్పటి మనస్థితి అంతా పరిపూర్ణంగా తెలిసికొని మన పూర్వీకులు ఏమోస్తరుగా ఉండేవారో, సంఘం మళ్ళా వెనకటిదశకు పోకుండా ఉండాలంటే ఎటువంటి జ్ఞానం విస్తరింపజేసుకోవాలో, మొదలైన సంగతులకోసం ఈ విజ్ఞానాన్ని జాగ్రత్త పెట్టుగోవలసిఉంది. ఇంతే కాదు, మరొక ఉపయోగంకోసంకూడా దీన్ని జాగ్రత్త పెట్టుగోవలసి ఉంది. అదేదంటే - శాస్త్రజ్ఞులు ఈ విజ్ఞానాన్ని పరిశీలించి ఏయే జాతులు ఏయేదేశాలనుండివచ్చేయో, ఏయేజాతులు ఏయేజాతుల నుండి ఏర్పడ్డాయో మొదలైనవన్నీ తెలియజేస్తున్నారు. ఈరకమైన జ్ఞానంకోసంకూడా ఈ విజ్ఞానాన్ని జాగ్రత్త పెట్టుగోవలసిఉంది.

ఈవిజ్ఞానాన్ని అనేకజాతులు భద్రపరచుకొన్నాయి. పాశ్చాత్య దేశాలు దీన్ని నశించిపోకుండా నిలబెట్టుకొన్నాయి. ఇంగ్లాండులో ౧౮౭౮ వ సంవత్సరంలో సాంప్రదాయిక విజ్ఞానసంపాదనా సంఘం (Folk Lore Society) అనుపేరున ఒక సంఘమేర్పడి దేశంలోగల ఈ విజ్ఞానాన్ని సేకరించి దీనికోసం ప్రత్యేకంగా ఒకపత్రిక యేర్పరిచి ముద్రించి, దీన్ని జాగ్రత్త పెట్టుకుంది.

మన తెలుగుదేశంలో అప్పుడప్పుడు ఈ విజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు ప్రకటించబడుతున్నాయి. ఈప్రకటించబడ్డ భాగం చాలా స్వల్పం. అకాస్తఅయినా క్రమరీతిగా చెయ్యబడలేదు. అందుచేత తెలుగుదేశంలో చెయ్యవలసిన పనిఅంతా ఇంకాముందే ఉందని చెప్ప వచ్చు. తక్కినదేశాలలో లాగే మనంకూడా మనదేశంలోని సాంప్ర దాయికవిజ్ఞానాన్ని క్రమరీతిగా సేకరించుకుని రక్షించుకోవలసిఉంది.

ఇంగ్లాండులో ఏర్పడ్డ సాంప్రదాయికవిజ్ఞాన సంపాదనాసంఘం ఏమోస్తరుగా పనిచేసిందంటే - ఈసంఘ మొక పత్రికను ఏర్పరిచి ఆపత్రికలో దేశంయొక్క వివిధభాగాలలో ఉన్న సాంప్రదాయిక విజ్ఞానాన్ని సేకరించి ప్రచురించింది. అటుతర్వాత మరికొందరు చేరి

ఆ పత్రికలో ప్రకటించబడ్డ వస్తువుని తాలూకాలవారీగా విభజించి ఒక్కొక్క తాలుకాలో సేకరించినదానిలోనుంచి మచ్చుకు కొంతకొంత తీసి ఒక్కొక్క సంపుటంకింద ప్రకటించారు. ఈమోస్తరుగా అనేక సంపుటాలు ప్రకటించబడ్డాయి. ఒక్కొక్క సంపుటంలో ప్రకటించబడ్డ తీరు ఏమిటంటే – తాలూకాలో దొరికిన సాంప్రదాయికవిజ్ఞానమంతా కొన్ని శాఖలుకింద విభజించబడింది. ఒక్కొక్క శాఖకింద దొరికిన వస్తువుఅంతా – ఊళ్ళన్నీ అకారాదిగా రాయబడి – ఏఊళ్లో సేకరించబడిన వస్తువు ఆఊరికింద రాయబడింది. అంతేకాదు, ఆ విజ్ఞానంలో ఒకఊరికి మరొకఊరికి గల భేదాలుకూడా తెలియచెయ్యబడ్డాయి. ఈమోస్తరుగా ఎంతోకష్టపడి క్రమరీతిగా ప్రకటించబడి ఈ విజ్ఞానం ప్రజకుపయోగకరంగా చెయ్యబడింది. పైమోస్తరుగా ఆంగ్లేయులు తమ సాంప్రదాయికవిజ్ఞానాన్ని తక్కినదేశస్థులలాగె జాగ్రత్తపెట్టుకున్నారు.

సాంప్రదాయికవిజ్ఞానాన్ని సేకరించడంకోసం మనరాష్ట్రంలో కూడా ఒకసంఘం ఏర్పడాలి. ఆ సంఘం ఒకపత్రికను ప్రచురించి ఆపత్రికలో తాము సేకరించిన సాంప్రదాయికవిజ్ఞానాన్ని ప్రకటించాలి. ఒకసంఘం చెయ్యవలసిన పని ఒకవ్యక్తి చెయ్యడంకష్టం. అయినా ఒకవ్యక్తే తాను చెయ్యగలిగినంతపనిచెయ్యవచ్చు, ఒకతాలూకాలోనో, లేక కొన్ని తాలూకాలలోనో ఉండే విజ్ఞానాన్ని తాను అందుకోసమే ప్రకటించే ఒకపత్రికలో ప్రచురించి కొంతవరకూ విజ్ఞానసేవ చెయ్యవచ్చు.

సాంప్రదాయికవిజ్ఞానమంతా ఒకేమోస్తరు వస్తువుకాదు. దానిలో అనేకవిషయాలున్నాయి. మొత్తంమీద దీన్ని మూడువర్గాలకింద విభజించవచ్చు.

౧. నమ్మకాలు, ఆచారాలు.

౨. కథనం, ఉక్తులు.

3. కళ.

౧. నమ్మకాలు, ఆచారాలలో ఈ కిందిశాఖలు ఉన్నాయి:

(అ) మూఢవిశ్వాసాలు, అజ్ఞానపు టలవాట్లు. ఈశాఖలో తిరిగి ఉపశాఖ లున్నాయి. అవేవంటే:

౧. జడప్రకృతికి సంబంధించినది.

ఉదా:—హంపీలో ఒక బండరాతిమీద సీతాఅమ్మవారు తన చీర ఆరవేసుకుంటే అమచ్చ ఆబండమీద ఉంది.

సప్తసాగరయాత్రలు చేస్తే స్త్రీలు గర్భిణు లవుతారు.

తోకచుక్క వస్తే ఎవడో వొక గొప్పవాడు మరణిస్తాడు.

సూర్యగ్రహణం వెళ్ళాక వారంరోజులవరకూ ఏకార్యం చెయ్యకూడదు.

(రత్నశాస్త్రంలో రత్నాలకు సంబంధించిన మూఢవిశ్వాసాలు దొరుకుతాయి.)

అమావాశ్యనాడు బచ్చలికూర కొయ్యకూడదు.
అమావాశ్యనాడు పుడితే దొంగఅవుతాడు.
మూలానక్షత్రాన్ని జన్మించకూడదు.
ద్వాదశి దగ్ధయోగం.
స్వాతివానకు ముత్యాలు తయారవుతాయి.
అర్జునుడి పదిపేర్లూ వల్లిస్తే పిడుగు పడదు.
మేఘగర్జనం ఇంద్రుడి రథధ్వని.
పైనమ్మకాలలో కొన్నిటికి జ్యోతిశ్శాస్త్రం కారణం.

౨. చెట్లు, మొక్కలకి సంబంధించినది.

ఉదా:—రావిచెట్టుకు ప్రదక్షిణాలు చేస్తే స్త్రీలు గర్భిణు లవుతారు.

చింతచెట్టుమీద దయ్యాలుంటాయి.
తులసిచెట్టుకు పూజచేస్తే కోరికలు సిద్ధిస్తాయి.
(ఉత్త కొబ్బరికాయకి దెయ్యంతిన్న కాయనిపేరు.)

ఏపాదుకైనా పురుగుపడితే శ్రీవత్ససగోత్రీకులు కుమ్మరిబుగ్గని తీసి "శ్రీవత్ససగోత్రపు సింహం లొచ్చేయి, పుచ్చుపురుగుల్లాల్లా విచ్చిపొండి" అని ఆబుగ్గి చల్లితే ఆపురుగులు నాశనమైపోతాయి.

ఇంటిలో మొండిచెయ్యి మొలిస్తే ఇల్లు విడిచిపెట్టాలి.

3. జంతువులు, జీవులకు సంబంధించినది.

ఉదా:—ఇంట్లో రోగి ఉండగా పులుగుపిట్ట అరుస్తే రోగికి చావుతప్పదు.

కాకి ఇంట్లోంచి ఎగిరితే ఇల్లువిడిచి పెట్టాలి.

గద్ద ఇంటిమీద వాలితే ఇల్లువిడిచిపెట్టాలి.

కాకి అరుస్తే ఇంటికి బంధు వొస్తాడు.

కాకుల మైథునం చూస్తే తను చచ్చినట్టు తన బంధువులికి ఉత్తరంరాయాలి.

పొద్దున్నే పిల్లిని చూడకూడదు.

(బల్లిపతనంవల్ల కలిగే లాభనష్టాలు పంచాంగం చూస్తే తెలుస్తుంది.)

తూనీగలు ఎగిరితే వాన కురుస్తుంది.

పాలపిట్ట దర్శనమైతే పరమాన్నం దొరుకుతుంది.

ఏదుపందిముల్లు ఎవరిదగ్గిర ఉంటే వారికి దెబ్బలాటలు వస్తాయి.

(అశ్వలక్షణశాస్త్రంలో అశ్వాలకు సంబంధించిన విశ్వాసాలన్నీ చెప్పబడిఉన్నాయి.)

౪. భూతాలు.

ఉదా:—దయ్యానికి మణమలు ముందుకి, వేళ్లు వెనక్కి ఉంటాయి.

దయ్యం తోలుముక్క అవుతుంది.

(ఊరూర దయ్యాలబావు లుంటూనేఉంటాయి)

౫. మాయ.

ప్రయోగం, శాతబడి, దిష్టి మొదలైనవి ఈ శాఖలోనే వస్తాయి.

౬. మంత్రాలు, తంత్రాలు.

పాముకాటు, తేలుకాటు, చప్పి, ఇరుకు, ఎక్కిళ్లు మొదలైన వాటి మంత్రాలు, ప్రయోగాలకు విరుగుళ్లు మొదలైనవి, రక్షలు, తాయత్తులు మొదలైనవి ఇందులో చెప్పబడతాయి.

ఉదా:—"మునగవేరు తూర్పునకు పారిన దానిని త్రవ్వి తెచ్చి ఆరోజుననే తాయతులో వేసివుంచుకుంటే కోల తప్పిపోవును."

"పచ్చిపసుపు, కన్నెకోమలి, తెల్లజిల్లేడు మొగ్గలు, నల్లవుమ్మెత్తవేరు, నిద్రగన్నేరు ఆకులు, మంచిగంధము, రాజపగడము నూరి వుండలుచేసి మధురావేళలో పెట్టిగయిస్తే వశ్యమగును స్త్రీపురుషులెవరైననుసరే.

౭. గారడి, భవిష్యత్ సూచన.

ఈశాఖలో సోది, పూనడాలు, కలలు, శకునశాస్త్రం, శకునాలు మొదలైనవి వస్తాయి.

ఉదా:—తెల్లవారగట్ట వచ్చిన కల నమ్మతగినది.

కలలో మామిడిపళ్లు, ముత్తైదు మొదలైనవి వస్తే మంచిది. శవం, వితంతువు మొదలైనవి వస్తే కీడు.

పిల్లి ఎదురు రాకూడదు.

(బల్లిపతనఫలాలు పంచాంగంచూస్తే తెలుస్తుంది.)

తుమ్మితే యేపనీ చెయ్యకూడదు.

౮. స్వర్గం, నరకం, పుణ్యపాపాలు గురించి ఈ శాఖలో ఉంటుంది.

౯. ఇతరమూఢ విశ్వాసాలు, ఆచారాలు.

నేను సేకరించినవి కొన్ని ఇక్కడ ప్రకటిస్తాను:-

గడపమీద కూర్చుని తుమ్మకూడదు. తుమ్మితే గడపని గండాలు.

తుమ్మితే చిరంజీవి, శతాయుస్సు, మార్కండేయులంత ఆయుస్సు అనాలి.

రాత్రిపూట తుమ్మితే నెత్తిమీద నీళ్ళు చల్లించుకొని ఏడూళ్లో పుట్టింది చెప్పాలి.

ఒక తుమ్ముకంటె ఎక్కువ తుమ్మితే తప్పులేదు.

రాత్రిపూట ఉప్పు అనకూడదు.

రాత్రిపూట ఉప్పు దీపానికి చూపిస్తేగాని వెయ్యకూడదు.

ఎవరైన ఎక్కడికైనా వెడుతూంటే ఎక్కడికి వెళుతున్నావని అడగకూడదు.

రాత్రిపూట క్షౌరముమాట ఎత్తకూడదు.

(తిథి వార నక్షత్రాలు చూచి క్షౌరము చేయించుకోవాలి. ఇది పంచాంగ సంబంధం.)

రోలుమీద కూర్చోకూడదు.

వాల్చిన రోకలి దాటకూడదు.

మునిపళ్ల మునివళ్లు కొరకకూడదు.

చెల్లెల్ని కాలితో తన్నకూడదు.

నడుస్తూ పళ్ళుతోముకుంటే అంతమేరా చెరువు తవ్వించాలి.

గడప మహాలక్ష్మి.

శుక్రవారంనాడు క్షవరంచేయించుకుంటే ఆడపడుచుకు అనర్థం.

లక్ష్మివారంనాడు కొత్తవ్యవహారాలేవీ మాట్లాడకూడదు.

కొత్తగుడ్డకు పసుపుపెడితేగాని కట్టకూడదు.

మంగళ ఆది సోమవారాలలో కొత్తగుడ్డకడితే అది తొందరగా కాలిపోయి చిరిగిపోతుంది.

దీపం పెడితేనేగాని మంచినీళ్లు తాగకూడదు.

జెర్రిని మంగళవారం నాడు చంపకూడదు.

ఒక్కటే పిల్లను పెడుతుంది కాబట్టి జెర్రిని చంపకూడదు.

పీటమీద పడుకోకూడదు.

చేటతో విసురుకోకూడదు.

మేకలమంద మధ్యనుంచి వెళ్లకూడదు.

(తలగడుగుకుపూర్వం పెద్దల ఆశీర్వచన.)

కాలినపంచ చాకలివాడికి వెయ్యందే కట్టకూడదు.

ఇద్దరిమాటలు ఒకటైతే ఇంటికి బంధువొస్తాడు.

బియ్యం కొలుస్తూన్నప్పుడు తవ్వ తిరగపడితే ఇంటికి బంధువొస్తాడు.

పొయ్యి అరుస్తే ఎవరో బంధు వొస్తాడు.

అరికాలు దురదపెడితే దెబ్బలాట వస్తుంది.

విస్తరాకు జరిగితే ప్రయాణం సిద్ధం.

పీటలు గోడకు అడ్డంగా చేరవెయ్యాలికాని నిలువుగా చేరవెయ్యకూడదు.

ఆడది జడవేసుకుని చెంపలు దువ్వుకోపోతే ముసిలిమొగుడు వస్తాడు.

రాత్రిపూట ఈలవేస్తే పాములొస్తాయి.

రాత్రిపూట అద్దంచూసుకుంటే ముందుజన్మలో బోగందై పుడతారు.

తేనెపట్టు పట్టినఇంటిని ఆరునెల్లు విడిచెయ్యాలి.

ఆదివారంనాడు ఉసిరికపచ్చడి ముట్టుకోకూడదు.

తలంటుకొన్నరోజున కాటుక పెట్టుకుంటే కలిగినవారిఇంట్లో పుడతారు.

మోకాళ్లమీద తలవంచుకు కూచోకూడదు.

భోంచేస్తూన్నప్పుడు ఎడమపాదం పట్టుకుంటే దరిద్రం.

కాళ్లుకడుక్కునేటప్పుడు మణమలు తడియకపోతే దరిద్రం.

కొత్తగిన్నెకు పసుపురాసి కొంచెం పాలచుక్క పోస్తేగాని వాడకూడదు.

కోతిఅంటే పిల్లలు మరింక ఎదగరు.

మంగళవారంనాడు కొత్తచీపురు కట్టకూడదు.

ఉప్పు చేతిలో వేస్తే కయ్యమొస్తుంది.

ఉత్తఉయ్యాల ఊపితే చంటిబిడ్డకి కడుపునొప్పి వస్తుంది.

ఇద్దరి చంటిపిల్లల్ని ఒకరిమొహం మొకరికి చూపిస్తే మూగి వాళ్లవుతారు.

చంటిబిడ్డకి అద్దం చూపిస్తే మూగిదవుతుంది, లేక పైపళ్ళువస్తాయి.

పుష్కరం వెళ్లేక రెండున్నరఏళ్ల వరకూ ఏ శుభకార్యం చెయ్యకూడదు.

శివదృష్టి, విష్ణుపృష్ఠం పనికిరాదు.

ఊళ్లో ఒక్క మేడ ఉండకూడదు.

(ఆ) ఆచారాలు. దీనిలోని ఉపశాఖలు-

౧. కొన్ని కొన్ని పండగలు కొన్నికొన్ని రోజుల్లోగాని, కొన్ని ఋతువుల్లోగాని వస్తాయి.

ఉదా:— కృష్ణజయంతికి ఉట్లపండగ.

(అమ్మవార్ల జాతర్లు కొన్నిరోజుల్లో వస్తాయి.)

వేసంకాలంలో వసంతోత్సవం వస్తుంది.

౨. పుట్టుకకు వివాహానికీ, మరణానికి సంబంధించినవి. ఇవన్నీ చాలామట్టుకు ఆయాకర్మకాండలలోనే ఉన్నాయి. అలాగులేనివి కూడ కొన్ని ఉన్నాయి.

ఉదా:—బిడ్డకనక బొడ్డుతాడు మెడకిచుట్టుకుని పుడితే కిందటి జన్మలో ఉరిపోసుకున్నట్టు అర్థం. పురిటిదినాల్లో ఎన్నెమ్మకథ చెప్పాలి. (పుత్రోత్సవమేకాని పుత్రికోత్సవం లేదు.)

పగటిపూట పుట్టినవాళ్ళు పగలు నిద్రపోతారు. రాత్రిపూట పుట్టినవాళ్ళు రాత్రి నిద్రపోతారు.

ఎడపిల్లకికీచంటి లేకపోతే మొగపిల్లాడు పుడతాడు.

బిడ్డకి మొదట పైపళ్ళువస్తే మేనమామకి అపాయం.

పిల్లాడు పాలుతాగాక ముద్దుపెట్టుకుంటే ఆబలమంతా మనకి వచ్చేస్తుంది.

స్థాలీపాకం నందిముహంనాడు వంకాయి వండకూడదు.

(పెళ్ళిలాంఛనాలు ఒక్కొక్కస్థలంలో ఒక్కొక్కమాదిరిగా ఉంటాయి.)

బహిష్ఠఅయి స్నానంచేశాక నోట్లో ఏమీవేసుకోనందీ చంటి పిల్లల్ని చూడకూడదు.

మనిషి చనిపోయినప్పుడు గట్టిగా ఏడుస్తే స్వర్గంతలుపులు విడతాయి.

(కొన్ని మతాలవాళ్ళను దహనంచేస్తారు. కొన్ని మతాలవాళ్ళను ఖననంచేస్తారు.)

(తద్దినంనాడు కొన్నికొన్ని కూరలు వండకూడదు.)

3. ఆటలు.

పాటలున్న ఆటలు కొన్ని, పాటలులేని ఆటలు కొన్ని, చిన్న పిల్లలు ఆడుకొనే ఆటలు కొన్ని, పెద్దవాళ్ళు ఆడుకునేవి కొన్ని. ఆటల్లో అనేకవిధు లున్నాయి. ఈ విధులు ఒకస్థలంనుంచి మరొక స్థలానికి భేదిస్తాయి.

ఉదా:—కోడిపందాలు, పికిలిపిట్టపందాలు, పావురంపందాలు గొర్రెపందాలు, మొదలైనవి, గవ్వలాటలు మొదలైనవి.

భారతిలో కొన్నిసంవత్సరాలకిందట వేటూరిప్రభాకరశాస్త్రిగారు పిల్లల ఆటలనుగురించి ఒకవ్యాసం రాశారు. ఈమధ్య మంగిపూడివేకంట శర్మగారు భారతిలో 'బాలక్రీడలు' అన్న పేరున కొన్ని ప్రకటించారు. గృహలక్ష్మిలో తరచుగా ఆటల్లనుగురించి ప్రకటించబడుతూఉంటుంది.

4. అనేకరకాలైన స్థానిక ఆచారాలు: ఇవి గ్రామపరిపాలనకి, శిస్తుల వసూళ్లకి, మామూళ్లకి సంబంధించిఉంటాయి.

ఉదా:—ఒకఊళ్ళో ఉండే ఆచార మేమిటంటే ఆ ఊళ్లోఎవ రైనా ఏకొత్తవస్తువైనా తెచ్చుగుంటే అదంతా ఊరికంతకూ కూడా పంచిపెట్టాలి.

కొన్నిఊళ్లలో ఊరికంతా ఒకేరోలు ఉంటుంది.

కొన్నిఊళ్ళలో కొన్నిసంతలు, జాతర్లు, ఉత్సవాలు, కొన్ని ప్రత్యేకపండగలు జరుగుతాయి.

పశువులకి పెట్టే పేర్లుకూడా ఈ ఉపశాఖలోనే చేరుతాయి.

౨. కథనం, ఉక్తులు.

(అ) ౧. జరిగేయని చెప్పేకథలు.

శేషమల్ల రాజగోపాలరావుగారు 'ఆంధ్రదేశీయ కథావళి' అని మూడు చిన్న సంపుటాలు ప్రకటించారు. తెలుగుకవుల కథలూ, స్థానిక చరిత్రలలోని కథలుకొన్నీ, తెనాలిరామలింగడు, తాతాచార్యులు, మర్యాద రామన్న, పరమానందయ్య, రేచుక్క పగటిచుక్క మొదలైనవారి కథలు ఈ శాఖలోనే చేరతాయి.

౨. శిశుకథలు.

తల్లి పిల్లలకు దేవతలు, రాక్షసులు, భూతాలు గురించి చెప్పే కథలూ, ఈగ, నక్క మొదలైన కథలూ యీ శాఖలో చేరతాయి.

3. కల్పనాకథలు.

ప్రకృత్యతీతాంశాలతో కలిసి జరగనివి జరిగినట్టుగా కనబడే కథలూ, పిట్టకథలూ ఈ శాఖలో జేరతాయి. ఈ పిట్టకథలు భారతిలోనూ, గృహలక్ష్మిలోనూ ప్రకటించబడుతున్నాయి. ఈ మధ్య భారతివారు పిట్టకథలను ఇక ప్రకటించమని రాశారు. దీనివల్ల సాంప్రదాయిక విజ్ఞానానికి చాలా నష్టంకలిగిందని చెప్పక తప్పదు. భారతివారు పిట్టకథలు అనేకం సేకరించడానికి అవకాశమిచ్చారు. వీరు మరల వీటిని తమ పత్రికలో ప్రకటించి సాంప్రదాయికవిజ్ఞానానికి ఉపకారంచేస్తారని నమ్ముతున్నాను.

౪. వినోదాలు, నీతికథలు, పెరిగేకథలు.

ఈ వినోదకథలు అనేకమంది ప్రకటించారు. చిలకమర్తివారు 'వినోదములు' అని ౨౭౦ కథలును ప్రకటించారు. నాదగ్గిరకూడా ఇంచుమించుగా అన్ని కథలుఉన్నాయి.

నీతికథలు కొందరు ప్రకటించారు.

పెరిగేకథలంటే – ఈవిధమైన కథలకు పరిమితిలేదు. మొదట వాటి పరిమాణానికీ ఇప్పటిస్థితికీ ఎంతో భేదముంటుంది. మొదట ఆకథ చాలా చిన్నదిగాఉండి క్రమేపీ లోకుల కల్పనలతో పెద్ద కథ అవుతూఉంటుంది. కాశీమజిలీలు, గొల్లసుద్దులు ఇటువంటివే.

౫. స్థలమాహాత్మ్యములు.

ఇవికూడా మనదేశంలో చాలా ఉన్నాయి.

ఉదా:—గోవుపాదాలు, కోటిలింగాలు, గోస్తనది మొదలైన వాటిని గురించి ఉన్న పురాణాలు.

౬. స్థానిక కథలు.

ఇటువంటికథలు మనకు స్థానికచరిత్రలలో దొరుకుతాయి. ప్రతాపచరిత్రం, రాయవాచకం వంటి వాటిలోకూడా దొరుకుతాయి.

(ఆ) పదములు, పాటలు (కళ క్రింద రానటువంటివి.)

ఉదా:—బొబ్బిలిరాజుకథ, కామమ్మకథ, దేసింగురాజుకథ, కాంభోజరాజుకథ, కుచ్చలకథ, చిన్నమ్మకథ, కీర్తనలు, తత్వాలు, తరంగాలు, ఆడవాళ్ళ పాటలు మొదలైనవి.

(ఇ) పాతపాటలు మొదలైనవి.

దీని ఉపశాఖలు—

౧. పాతపాటలు.

ఇవి ముఖ్యంగా పిల్లలిని నిద్రపెట్టడానికి పాడుతున్నారు. వీటిని మొత్తంమీద జోలపాటలని అంటున్నారు. కాని దీనిలో ఒక్క జోలపాటలే కాకుండా పణతిపాటలు మొదలైనవికూడా ఉన్నాయి. ఇటీవల ఇవి ఎక్కువగా సేకరిస్తున్నారు. నాలుగేళ్ళకిందట వీటిని కొన్నిటిని పాతపాటలన్న పేరున నేను భారతిలో ప్రకటించాను. అప్పటినుంచి అనేకమంది ఈ పాతపాటలను సేకరించి భారతిలోను, ఆంధ్రభూమిలోను, గృహలక్ష్మిలోను ప్రకటిస్తున్నారు. ఈమధ్య భారతివారు ఈ పాటలను భారతిలో ప్రకటించడం మానేశారు. దీనివల్ల సాంప్రదాయిక విజ్ఞానానికి కలిగిన నష్టమింతఅని చెప్పలేము. భారతివారు తిరిగి వీటిని ప్రకటించి భాషాసేవ చేస్తారని నమ్ముతున్నాను.

౨. కట్టుకథలు లేక పొడుపుకథలు, అర్థంలేని పాటలు.

ఉదా:—వంకరటింకరశో, వాని తమ్ముడు అ,

నల్లగుడ్లమి, నాలుగుకాళ్ళ మే.

మాతాత రెండెడ్లను తెచ్చాడు. ఒక ఎద్దు తిరుగుతుంది, ఒక ఎద్దు తిరుగడు.

ముద్దుల్లుముద్దుల్లు మచ్చికాయల్లు
అమ్మాయిముద్దుల్లు గచ్చకాయల్లు.

3. సామెతలు.

ప్రాపంచికోక్తులుకూడ ఈశాఖలోనే చేరతాయి.

ఉదా:—కుక్కను చంపితే గుడికట్టాలి.

ఇంట్లో ఈగల మోత బైట పల్లకీల మోత.

కొయ్యతోటకూర కొయ్యకచెడెను,

కొండంతకాపురం కొండేల చెడెను.

కొడుకుల కననివాళ్ళకడు పేమి కడుపు,

కులముద్ధరించని కొడు కేమికొడుకు.

సామెతలు అనేకమంది సేకరించి ప్రకటించారు. ఒకరుసేకరించినవే మరొకరుకూడా సేకరించి ప్రకటించారు. దీనికి కారణం, ఎవరేవి ప్రకటించారో తెలియకపోడమే! పోనీ ఇతరులు ప్రకటించనటువంటి వాటినే ప్రకటిద్దామని అనుకొన్నప్పటికీ ఎన్నిపుస్తకాలని సరిచూడగలరు. అంచేత ఎవరు సేకరించినవాటిని వారు ఇవి కొత్తవా, పాతవా అని యోచన చెయ్యకుండా ప్రకటిస్తున్నారు. దీనివల్ల తెలుగు దేశంలో మొత్తంమీద ఎన్ని కొత్తసామెతలు చేరేయో తెలియకుండా ఉంది. కొత్తగా సేకరించినవాళ్ళకి, ఇతరులు సేకరించినవే మళ్లా సేకరిస్తున్నా మేమో అనిపిస్తూంది. అందుచేత ఇప్పటివరకూ సేకరించబడ్డ సామెతలను సంపుటాలకింద ప్రకటించవలసిఉంది. దీనివల్ల ఇంతవరకూ సేకరించబడ్డ సామెతలన్నీ ఒకచోట ఉండడమవుతుంది. కొత్తసామెతలను చేర్చడానికి అవకాశం కలుగుతుంది. కొన్నాళ్ళకిందటి

వరకూ ప్రకటించబడ్డ సామెతల పుస్తకాలన్నిటినీ పరిశీలించి శ్రీనాళం కృష్ణారావుగారు ఆసామెతల నన్నిటినీ అకారాదిగా రాశారు. వాఙ్మయాభిలాషులు సహాయంచేసి ఈగ్రంథాన్ని ప్రకటిస్తే వాఙ్మయానికెంతేనా ఉపకారంగాఉంటుంది. ఇప్పటివరకూ సేకరించబడ్డ సామెతలు నశించిపోకుండా ఉంటాయి. కొత్తసామెతలు ప్రకటించడానికి వీలవుతుంది. నేను కూడా అనేక సామెతలు చేర్చాను. తెనాలి వాస్తవ్యులైన శ్రీ పిల్లలమర్రి లక్ష్మీనారాయణగారు ఇప్పటివరకు లభించిన తెలుగుసామెతలనన్నిటినీ సంపుటాలుగా వెయ్య సంకల్పించుకొన్నారు.

౪. వినోదపుపేర్లు లేక ఉడుకుపేర్లు.

ఉదా:—ఆకాశరామన్న, వల్లకాటి రామనాథయ్య, అడారి అచ్చన్న, పెళ్ళిళ్ళ పేరయ్య.

౫. స్థలసంబంధమైన పాటలు.

ఉదా:—అత్తపోసిన గంజి సత్తువలేదు
ఆల్లుడు సిరిపురపు గట్టెక్కలేడు.
కాకినాడానకట్టు కాలికింద తొక్కిపెట్టు
మాటలాను మామిడాడ ఊసులకు ఉల్లిపాడు
దొంగలకు ద్వారపూడి ముండలకు మురమండ
రంగులకు రాజమండ్రి ముక్తులకు తిరుపతి
యుక్తులకు నెల్లూరు శక్తులకు గుంటూరు

నా ప్రోత్సాహం మీద శ్రీ నేదునూరి గంగాధరంగారు వందల కొద్ది పాతపాటలు సేకరించారు. ఇవి కొన్ని పత్రికలలో ప్రకటిస్తూ వచ్చాను. భాషాభిమానులెవరైనా వీటిని సంపుటాలుగా ప్రకటించి విజ్ఞానానికి ఉపకారం చేస్తారుగాక!

౬. పామరుల శబ్దవ్యుత్పత్తి

ఉదా:—కాతేరుఅన్న ఊరుదగ్గిర సారంగధరునిపాతేరు. ఈపాతేరు అన్నమాటక్రమేపీ కాతేరుఅయింది.

పల్లంకుర్రు: ఈఊరుగల ప్రదేశం మొదట చవిటి నేల. అక్కడ బ్రహ్మ యజ్ఞంచేసి 'ఫలంకురు' అని ఆశీర్వదించి సారవంతమైన నేలగా చేశాడు, ఈ 'ఫలంకురు' ఇప్పుడు పల్లంకుర్రు అయింది.

కేశనకుర్రు: ఈఊరిదగ్గిరగోదావరి కొంత ఉత్తరంగా ప్రవహిస్తూంది. కాశీదగ్గిర గంగ ఉత్తరంగా ప్రవహిస్తూంది. కాశీలాగే ఈఊరుకూడ గొప్పక్షేత్రమయిపోతుందని దేవతలువెళ్లి బ్రహ్మదగ్గిర మొరపెట్టారు. అప్పుడు బ్రహ్మ 'కాశీం నకురు' అని అన్నాడు. ఆ వెంటనే గోదావరి మళ్లా దక్షిణంగా మళ్లింది. 'కాశీం నకురు' కేశనకుర్రు అయిపోయింది.

3. కళ.

దీనిలోని శాఖలు.

౧. పదములు పాటలలోని సంగీతము. అంటే ఈపదములు పాటలలోని గణాలు, యతిస్థానాలు, స్వరం, రాగమ్ంటే రాగం, తాళం, పల్లవి, అను పల్లవి మొదలైనవాటినిగురించి. పదములు పాటలకి, కళ పాటలకి(Art Songs) ఉండే పోలికలూ భేదాలూ కూడా ఇందులోనే తెలుపబడతాయి.

౨. పామరుల నాటకాలు.

యక్షగానాలు, తోలుబొమ్మలు, కొయ్యబొమ్మలు, భాగోతాలు, హాస్యం పగటివేషాలు ఇందులోనే వస్తాయి.

పైన చెప్పినవిధంగా సాంప్రదాయికవిజ్ఞానం సేకరించుకోవలసిఉంది. దీనివిలువ ఎంతేనా ఉంది. ఇదిచరిత్రపరిశోధకులకు, శాస్త్రజ్ఞులకు, వాఙ్మయాభిలాషులకుకూడ చాలా అవసరం. ఇప్పటివరకూ దేశంలో ,అక్కడక్కడ కొస్తకొస్త ప్రయత్నంమాత్రమే జరిగింది. కాని క్రమరీతిగా పనిచేస్తేనే గాని ఈపని లాభకరంగాను, సంపూర్ణంగాను జరగదు.

# చదువరులు పరిశీలించ దగు అధికారాంశములు

(1) జనవినోదినిపత్రిక 1884 ఫిబ్రవరి సంచికలో హిందూ బాలుర ఆటలు.

(2) Folk lore of the Telugus by G. R. Subbaramaiah.

(3) Indian Folk Tales by P. Ramachandra Rao.

(4) ఆంధ్రగ్రంథాలయ సర్వస్వము రెండవ సంపుటము మొదటి సంచికలో 'ఏలపాటలు'.

(5) శేషమళ్ళ అచ్యుతరావుగారి ఆంధ్రపదములు, పాటలు.

(6) కృష్ణాపత్రిక 21-4-1917, 14-6-1917 సంచికలలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మధురకవితలు.

(7) కృష్ణాపత్రిక 25-11-1916 సంచికలో పురాణం సూరిశాస్త్రి గారి ఏలపాటలు.

(8) మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అనాదృతవాఙ్మయము.

(9) Indian Antiquary 1874 సంచికలో J. A. Boyle యొక్క Folk Songs.

(10) శేషమళ్ళ రాజగోపాలరావుగారు భారతి 1 వ సంపుటం 7 వ సంచికలో కొన్నిపాటలు.

(11) Modern Review 1934 ఆగష్టు, సెప్టెంబరు సంచికలలోని Folk Songs వ్యాసం.

(12) గృహలక్ష్మి పత్రికలో ఊర్మిళాదేవి నిద్ర వ్యాసం.

(13) గిడుగు వెంకటరామమూర్తిగారి వ్యాససంగ్రహంలో, 'స్త్రీల సారస్వతము', 'పదకర్తలు'.

(13) 1923, 1924 South Indian Research పత్రికలో వ్యాసములు.

(14) ప్రతిభలోపడ్డ కొన్నివ్యాసాలు.

---

# పాతపాటలు

## మొదటి ఖండం

---

### ఉపోద్ఘాతం *

ఈ పాత పాటలు నా పెద్దకుమారుడగు చేకుమళ్ల కామేశ్వర రావు, బి. ఏ. కష్టపడి సేకరించినవి. అతనికి చాలకాలమునుండియు, నిట్టి పాటలను, సామెతలను, కథలను, జాతీయములను (Idioms) కూర్చి యుంచుకొనుట యొక యభిమాన కార్యముగా నుండెను. ఈ పాతపాటలలో జాలవఱకు నాతల్లిగారి నోటనుండి వ్రాసికొనెను. కొన్నిటిని విజయనగరము నందును, మరికొన్నిటిని నెల్లూరునందును సంపాదించెను.

అతను సుమారు రెండువేలకంటె నెక్కుడుగా తెలుగు సామెతలను, లోకోక్తులను సమకూర్చెను. ఇవిగాక ఆంధ్ర జాతీయములు (Telugu Idioms) చాలయున్నవి. ఈ జాతీయములు చాలచిత్రముగ నుండును. బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, స్త్రీలు, పురుషులు మున్నగువారు మాట్లాడుచున్నప్పుడు స్వభావసిద్ధముగాను, అనాలోచితముగాను వారి సంభాషణయందు వాడుకచేయబడు ప్రత్యేకవిలక్షణ ప్రయోగములు వీనియందు గాన్పించుచుండును. వీనినన్నిటిని సంపాదించుట కితను చాలకాలము నిరాడంబరమైన పరిశ్రమ చేయవలసివచ్చెను.

అతను సేకరించిన భాషావస్తు సముదాయములో పాతపాటలను మాత్రము ప్రస్తుతము, 'భారతి'లో ముద్రించుటకు పత్రికాధిపతు లంగీకరించిరి. ఇందలి జోలపాటలను ప్రచురించుటకు ముఖ్యకారణము లేవన—

---

* పాతపాటలు మొదటిఖండం ఈ ఉపోద్ఘాతసహితంగా 'భారతి' యొక్క 1929 నవంబరు, డిశంబరు సంచికలలో అచ్చయింది.

(౧) శిశుపోషణంజేసెడు తలిదండ్రులగు యువతీ యువకులు తమ పిల్లల నోదార్చుటకును, వుబుసు పుచ్చుటకును, నిద్దురపెట్టుటకును యీ జోలపాటలను పాడిన నెక్కువ యుపయోగముగా నుండును.

(౨) ప్రస్తుతము ప్రాథమిక పాఠశాలలలో చదువుచున్న బాలురకును, బాలికలకును, వాచక పుస్తకముల ననేకులువిద్యాధికులు వ్రాయుచున్నారు. అట్టి వాచక పుస్తకములలో శిశుతరగతి కుపయోగించెడు పాఠములు ముఖ్యముగా బాలగీతములు Nursery Rhymes రూపముగా నుండుట చాల మంచిదని అనుభవైకవేద్యమైన విషయము. కావున వాచక పుస్తకములను వ్రాసెడు యుపాధ్యాయులీ జోలపాటల నుంచి వలసిన వాని నేర్చి తీసికొనవచ్చును.

(3) ఆంధ్రజాతీయత సర్వతోముఖముగా నభివృద్ధి బొందుటకు జన సామాన్య మందున్న యలేఖ్య పారంపర్య విద్య (Traditional lore) నశింపకుండ జాగ్రత పెట్టవలసి యున్నది.

పైన జెప్పిన కారణములచేత నిటువంటి పాత పాటలను బాల [illegible]శాభిమానులు సంపాదించి ప్రచురింతురుగాక !

—టేకుమళ్ల అచ్యుతరావు

## ౧. జోలపాటలు

౧. ఊ చక్క వూగదే వుయ్యాలచేరు
పాడక్క నిద్రపోడు పట్టి అబ్బాయి.

౨. విశాఖపట్నాన విసిరిందిగాలి
వింజరపు రేవున్న తేలింది వాడ
వర్తకుడి పేరేమి వాడ పేరేమి
వాడలో పోసిన్న దినుసు పేరేమి
వర్తకుడు అబ్బాయి వాడ నా వాడ
వాడలో పోసిన్న దినుసు ముత్యాలు.

౩. ఇంతంత దీపమ్ము ఇల్లల్ల వెలుగు
ఈశ్వరుడి చందమామ జగతెల్ల వెలుగు
గోరంత దీపమ్ము కొండల్ల వెలుగు
గోపాలకృష్ణమ్మ మందల్ల వెలుగు
మాడంత దీపమ్ము మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి మాకళ్ళ వెలుగు.

౪. సూర్యుడు చంద్రుడు అన్నదమ్ముల్లు
సూటిగుర్రా లెక్కి జూదమాడేరు
అబ్బాయి తమ్ముడు అన్నదమ్ముల్లు
లక్కపావా లెక్కి లెక్కరాసేరు.

౫. ఏటిగట్టుమీద సంధ్యల్లు వాచ్చు
ఎర్రన్ని చినవాడు ఎవరి అబ్బాయి

నాగగ (బ ?) ంధపు చెవులపోగు లున్నాయి
నా మేనల్లుడు రార అబ్బాయి!

౨. ఏటిగట్టుమీద కరివేపచెట్టు
గాలివానవచ్చి కొమ్మ లల్లాడె
కొమ్మలల్లాడెనే గొలుసు లల్లాడె
కొనికొన్ని ముత్యాలచేరు లల్లాడె
ఆచెట్లపై నుండి అబ్బాయిరాగ
బంగారు తలపాగ చెంగు లల్లాడె.

౩. ఏవాడ వెళ్ళేవు అబ్బాయి నువ్వు
ఎవ్వరు కట్టేరు కాళ్ళమువ్వల్లు
కలవారి పట్టన్ని గారాములన్ని
కంచారి కట్టేడె కంచుమువ్వల్లు
తనతోడి పట్టన్ని తనకు ముద్దన్ని
అన్నయ్య కట్టేడె వెండిమువ్వల్లు.

౪. చిక్కుడు పువ్వెరుపు చిలకము క్కెరుపు
చిగురెరుపు చింతల్ల దోరపం డెరుపు
రక్కిస పండెరుపు రాగి చెంబెరుపు
రాచవారిళ్ళలో మాణిక్య మెరుపు
తా మెరుపు అమ్మాయి తనవారిలోన.

౫. ఏనుగు మెక్కెవ్వ్యో ఓరాజు రాగ
ఏకదివాణమ్ము మెవరి లోగిలి

పల్లకీ యెక్కి_య్యో ఓరాజు రాగ
బంగారు తలుపుల్ది యెవరి లోగిలి
అందలా లెక్కి_య్యో ఓరాజు రాగ
అద్దాల తలుపుల్ది యెవరి లోగిలి
ఏనూగ యెక్కి_య్యో అబ్బాయిరాగ
ఏకదివాణమ్ము వదినె లోగిలి
పల్లకీ యెక్కి_య్యో అబ్బాయిరాగ
బంగారు తలుపుల్ది వదినె లోగిలి
అందలా లెక్కి_య్యో అబ్బాయిరాగ
అద్దాల తలుపుల్ది వదినె లోగిలి.

౧౦. గంధమ్ము తీసిన్న సాన చల్లన్న
సభలోన అబ్బాయిమాట చల్లన్న
ఇందూవ తీసిన్న నీళ్లు చల్లన్న
ఇంట్లోను అమ్మాయి కడుపు చల్లన్న.

౧౧. గోపాలకృష్ణమ్మ పెళ్లయ్యోనాడు
గోరింట పూచింది కొమ్మ లేకుండ.
మాయింట అబ్బాయి పెళ్లయ్యోనాడు
మల్లెలు పూచేయి మొగ్గ లేకుండ.

౧౨. ఉయ్యాలలో బాల వుగ్గు కేడుస్తే
ఉత్తమ్మ యేశోద వూచి వుగ్గొయ్యి
పల్లకీలో బాల పాల కేడుస్తే
బలభద్ర మాలక్ష్మి పాడి పాలొయ్యి

ఏటికిక్కి కాలువ యెంతదూరమ్ము
ఎత్తిపెంచినతల్లి కెంత మోహమ్ము
కాలువ నీళ్లన్ని కడుసముద్ర మాయె
కడలేనిమోహమే కన్నతల్లికిక్కి.

౧౩. ఊరికిక్కి ఉద్యోగరాజు వచ్చేడు
విడిమట్టు చూపండి విందు నాయిల్లు
ఊరికిక్కి ఉద్యోగరాజు అబ్బాయి
విడిమట్టు నీయిల్లు విందు నాయిల్లు.

౧౪. ఆటల్లు పాటల్లు అత్తవారింట
అతిరాచ చిటిపనులు అమ్మగారింట.

౧౫. తోటాకూరా చెట్టయ్యావలెను
వాగ్గలి పెరిగింది దొడ్డిముందార
రాచాయింటా కన్నెయ్యా వలెను
అబ్బాయి యింటికే వచ్చించి కన్నె.

౧౬. చిక్కుడాకు మీాద చిలక వాలింది
చిల కెక్కి ఓరాజు చిక్కివున్నాడు
అరిటాకు మీాద హంస వాలింది
హంసెక్కి ఓరాజు అమిరివున్నాడు
కొబ్బరాకు మీాద గోర వాలింది
గోరెక్కి ఓరాజు కోరివున్నాడు
మామిడాకు మీాద మంచు వాలింది
మంచెక్కి ఓరాజు పొంచివున్నాడు

గుమ్మడాకు మీాద గువ్వ వాలింది
గువ్వెక్కి ఓరాజు గూడొగ్గినాడు
చిక్కుడాకు మీాద చిలక అబ్బాయి
చిలకెక్కి అమ్మాయి చిక్కివున్నాది
అరిటాకు మీాద హంస అబ్బాయి
హంసెక్కి అమ్మాయి అమిరివున్నాది
కొబ్బరాకు మీాద గోర అబ్బాయి
గోరెక్కి అమ్మాయి కోరివున్నాది
మామిడాకుమీాధ మంచు అబ్బాయి
మంచెక్కి అమ్మాయి పొంచివున్నాది
గుమ్మిడాకు మీాద గువ్వ అబ్బాయి
గువ్వెక్కి అమ్మాయి గూడొగ్గినాది.

౧౭. వేసంగి కాలాన ఓ పెళ్లికొడకా
వేపతోరణాల సీడనే రమ్మి
మాయింట అబ్బాయి పెళ్లయ్యేనాడు
మామిడితోరణాలు మరి దూరి రమ్మి.

౧౮. దేవుడిగుళ్లోను దేవు డాడీని
దేవేంద్రసభలోను జూద మాడీని
పరమేశ్వరుడు గుళ్లోను పాము లాడీని
పణతి నా నట్టింట బాల లాడీని.

౧౯. పిల్లి పిల్లి పిల్లి పిల్లలకుతల్లి
పల్లేరుముళ్లలో పాలిచ్చిపోవె

పిల్లలికి పాలోసి పల్లెలికి బంపి
అబ్బాయికి పాలోసి ఆడుకో బంపు.

౨౦. వీధి నెందరు వున్న విసరదేగాలి
రచ్చ నెందరు వున్న రాదమ్మవాన
నా చిన్నఅబ్బాయి వీధి నిలుచుంటే
మొగలిపువ్వులగాలి ముత్యాలవాన.

౨౧. చిలక లాడేనమ్మ హంస లాడేని
పావురా లాడేని పందిళ్లలోన
చిలక నాఅబ్బాయి హంస అమ్మాయి
పావురం కుర్రవాడు పందిళ్లలోన.

౨౨. పిల్లెమ్మకన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయికన్నులు కలువరేకుల్లు
కలువరేకులవంటి నీ కన్నులాకు
కాటుకలు పెట్టితే నీకు అందమ్ము.

౨3. ఏడవకు ఏడవకు వెర్రినాతండ్రి
ఏడిస్తె నీకళ్ల నీరు కారేని
నీళ్ళైను కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారుకళ్ళ.

౨౪. చింతచెట్టుకింద చిటిబొమ్మరిల్లు
వాటిక్కి వాకిళ్ళు బోరుతలుపుల్లు.

బోరుతలుపులకింద పొందైనమేడ
ఆమేడ నున్నాయి యిద్దరు హంసల్లు – ఆమేడ.
ఆయిద్దరు హంసల్ల పేరేమిపేరు – ఆయిద్దరు.
రాచిలుకఅబ్బాయి రంభఅమ్మాయి–రాచిలుక.
చిలుకలకు చెలికాడుతానుఅబ్బాయి–చిలుకలకు.
హంసలకు చెలికత్తె తాను అమ్మాయి.

౨౫. అబ్బాయి మామల్లు ఎటువంటివారు
చెవికిచెవికి బారెడేసి పోగుల్లవారు–చెవికి.
అంచుపంచెలవారు అంగీలవారు–అంచు.
పట్టుపంచెలవారు పాగాలవారు–పట్టు.
పెసరకాయల వంటి పెదిమెల్ల వారు–పెసర.
కందికాయలవంటి కనుబొమ్మల్లవారు–కంది.
మిరపకాయలవంటి మీసాలవారు–మిరప.
వారు మా అబ్బాయి మేనమామల్లు.

౨౬. తామలపాకులమీద రేకల్లువ్రాసి
తమ్ము డంపినాడె తన ముద్దుమాట
తనముద్దుమా టొకటి దబ్బపండొకటి
“నాచిన్నతమ్ముడు రార అబ్బాయి”.

౨౭. గోరింటపువ్వువంటి కొడుకు నెత్తుకొని
బాలింతవచ్చింది బావినీళ్ళకు
ఏదేది బాలింత యెంత చక్కందో
మా చిన్నిపట్టుచీర మణవలకు పసుపు

కళ్ళదీ కాటుక పళ్ళదీ మెరుపు
మావాడ బాలింత అబ్బాయితల్లి.

౨౮. తూర్పున్న అబ్బాయి యిల్లుకట్టేను
దూలాలుమోసేరు దూదిపకుపుల్లు
పడమటను అబ్బాయి యిల్లుకట్టేను
పట్టెల్లు మోసేరు పాలకావిళ్లు
దక్షిణాన్ని అబ్బాయి ఇల్లు కట్టేడు
దండెల్లు మోసేరు ధనముపెట్టెల్లు
ఉత్తరాన అబ్బాయి యిల్లుకట్టేడు.

..............................

౨౯. తాతల్లు గట్టిన్న ధర్మశాలల్లు
అవ్వల్లు అలికిన అరుగుల్లమీద
ముత్తవ్వలు పెట్టిన ముగ్గులమీద
కూచోర అబ్బాయి కుదిమట్టుగాను-కూ.
ఊచవే అమ్మాయి వుయ్యాలచేరు-ఊచవే.
పాడవే అమ్మాయి బలగ మందర్ని-పాడవే.
ధరణిచే రట్టుకొని తనవార్నిపాడె-ధరణి.
భూమిచే రట్టుకొని పుత్రుణ్ణిపాడె

౩౦. ఊరీముందర డేర లెవ్వారివి
ఉత్తమ్మ బిరుదుల్ల రాజెవ్వారమ్మ
ఊరీముందర డేరల్లుమావి
ఉత్తమ్మ బిరుదుల్ల రాజు అబ్బాయి.

౩౧. ఆయిఆయిఆయి ఆపదలుగాయి
చిన్నవాళ్ళను కాయి శ్రీవేంకటేశ
గాయిగాయిగాయి యేదమ్మగాయి
అంగళ్ళ ఆడేటి అబ్బాయిని గాయి
పోతేరమ్మా పొత్తుళ్లగాయి
పొత్తుళ్ళ నాడేటి అబ్బాయి గాయి.

౩౨. చిన్నారి పాచికలు మావి లోగిళ్లు
చిన్నబాలా ఆడు చినబాల్లుతోడి
బంగారు పాచికలు మావి లోగిళ్లు
బాలలాడేరు మా అబ్బాయితోడి.

౩౩. కోటంత దేవుడికి మేటంత పత్రి
బ్రహ్మాంత ఆయుస్సు నీకు నా బాబు.

౩౪. జోలల్లుపాడితే జొన్నల్లుపండు
జోలలకు జొన్నబువ్వ నీకు వరిబువ్వ
ఏడ్చేటి అబ్బాయికి ఎర్రావుపాలు
నా చిన్న అబ్బాయికి నల్లావుపాలు.

౩౫. అబ్బిని కొట్టినకొట్టు ఊరెల్లరట్టు
తేరె మా అబ్బాయికి ముత్యాలబొట్టు
ముత్యాలబొట్టుకీ మూడు రేకల్లు
రత్నాలబొట్టుకీ రావి రేకల్లు
వజ్రాలు స్థాపించిన వారి మామల్లు
మాణిక్యాలు స్థాపించిన వారి బాబుల్లు.

౩౬. అబ్బిని కొట్టినకొట్టు వూరెల్లరట్టు
తేరె మా అబ్బాయికి తేనెగాజుల్లు
ముత్యాలబొట్టెట్టి పట్టుచీరగట్టి
ముద్దువచ్చింది మాఅబ్బాయిమోము-ముద్దు.
అద్దమై తోచింది వద్దిమామలకు-అద్దమై.
మేలిమై తోచింది మేనమామలకు-మేలి.
మేనమామలముద్దు మేలిమ్మిముద్దు-మేన.
తాతలకు తమచిన్న అబ్బాయిముద్దు.

౩౭. చిట్టి నా అబ్బాయి చిరుమొగముచూచి
సిగ్గుపడి చంద్రుడూ పొడవ జాలాడు.

౩౮. ముద్దుల్లు ముద్దుల్లు ముచ్చి కాయల్లు
అమ్మాయి ముద్దుల్లు గచ్చకాయల్లు.

## ౨. ఆ ట పా ట లు

౩౯. గుడుగుడు గుంచం, గుండారాగం
పాములపట్నం, పడగారాగం
అత్తారిచెవిలో ముత్యాలేస్తే
బయటికిరావే, పందికొక్కా.

౪౦. కొంగ కొంగ గోళ్లు
రంగడిచేతిరాళ్లు
నాచేతిపూలు.

౪౧. ఏనుగమ్మా ఏనుగు
ఏవూరెళ్లిం దేనుగు
ఉప్పాకెళ్లిం దేనుగు
ఉప్పునీళ్లు తాగిందేనుగు
మావూరొచ్చిం దేనుగు
మంచినీళ్లు తాగిందేనుగు.

౪౨. చెమ్మచెక్క చారెడేసిమొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు లెయ్యంగ
రత్నాలచెమ్మచెక్క రంగు లెయ్యంగ
పగడాలచెమ్మచెక్క పందిళ్ళెయ్యంగ
పందిట్లొ మాబావ పెళ్లిచెయ్యంగ.

౪౩. బావాబావా పన్నీరు
బావని పట్టుక తన్నేరు
వీధి వీధి తిప్పేరు
వీసెడు గుద్దులు గుద్దేరు
పట్టెమంచం వేసేరు
పాతికగుద్దులు గుద్దేరు
నులకమంచం వేసేరు
నూరుగుద్దులు గుద్దేరు.

## ౩. ప ణ తి పా ట లు

౪౪. చుట్టు చక్కందమ్మ చక్కిలపుచుట్టు
చూలింతచక్కంది ఓరాచదేవి!
పండుచక్కంతమ్మ పనసయ్యాపండు,
బాలింతచక్కంది ఓరాచదేవి!
ఆకుచక్కందమ్మ తామల్లపాకు
అయిదువచక్కంది ఓరాచదేవి!
కొమ్మచక్కందమ్మ గోరింటకొమ్మ
కొమరాలుచక్కంది ఓరాచదేవి!
పోకచక్కందమ్మ బొబ్బిల్లిపోక
బోగపుది చక్కంది ఓరాచదేవి!

౪౫. మానుచక్కందమ్మ సంపెంగమాను
మహాలక్ష్మి చక్కంది ఓరాచదేవి!
పువ్వుచక్కందమ్మ దానిమ్మపువ్వు
పూబోడిచక్కంది ఓరాచదేవి!
పువ్వుచక్కందమ్మ గుమ్మడిపువ్వు
పునిస్త్రీచక్కంది ఓరాచదేవి!

౪౬. ఓయిఓయిఓయి ఓకాపుపిల్ల
తాటిమేకచల్ల తాగడేగొల్ల
నిన్నమొన్నటిచల్ల నేటిక్కిపుల్ల,
కవ్వాన్ని తిప్పింది కమ్మన్నిచల్ల.

౪౭. చిలకల్లు చిలకల్లు అందు రేకాని
చిలకలకు రూపేమి పలుకు లేకాని
హంసల్లు హంసల్లు అందు రేకాని
హంసలకు రూపేమి ఆట లేకాని
పార్వాలు పార్వాలు అందు రేకాని
పార్వాలకు రూపేమి పాట లేకాని
కోయిల్లు కోయిల్లు అందు రేకాని
కోయిల్లకు రూపేమి ఘోష లేకాని
చిలకల్లు మాయింటి చిన్న కోడల్లు
హంసల్లు మాయింటి ఆడపడుచుల్లు
పార్వాలు మాయింటి బాలపాపల్లు
కోయిల్లు మాయింటి కొత్తకోడల్లు.

౪౮. వండా రారమ్మ వడక వంటల్లు
వల్లభుడు అబ్బాయికి వడుగు మాయింట
కట్టా రారమ్మ కలవతోరణాలు
కాముడీ అబ్బాయి కల్యాణమన్ని
పెట్టా రారమ్మ పెళ్ళిముగ్గుల్లు
పెంపుడు అబ్బాయికి పెళ్ళిమాయింట
చదవ రారమ్మ సమర్త కట్నాలు
చదరాలు అమ్మాయి సమర్త మాయింట
తియ్యా రాశమ్మ చిప్పగంధాలు
సింహాలక్ష్మి అమ్మాయికి సీమంతమనిరి
పుయ్యా రారమ్మ పురిటిగోడల్లు
పుణ్యశాలి సీతమ్మకు పురుడుమాయింట.

౪౯. చింతచెట్టుక్రింద చికిలింతగడ్డి
మెయ్యామగ మా ఆవు పెయ్యాలకన్ని
ఆవుపాలు తెచ్చి పరమాన్నం వండి
కుడువమగ మా అమ్మి కూతుళ్లకన్ని.

౫౦. నీలాటిరేవంత నిగ్గుతేలింది
ఏచేడె కడిగింది యీ చాయపసుపు
పచ్చిపసుపు బావల్ల మరదలాడింది
అణుప్పసుపు అన్నల్ల చెల్లెలాడింది
కొట్టు పసుపు కొమాళ్ల తల్లియాడింది
కొమాళ్ల తల్లియే తాను గోపమ్మ
గొంతి యాడిన పసుపు గోవపూచాయ
అన్నల్ల చెల్లెలే తాను అమ్మాయి
అతివ ఆడిన పసుపు ఆవపూచాయ
బావల్ల మరదలె తాను అమ్మాయి
పణతి ఆడిన పసుపు బంగారుచాయ.

## ౪. ప్ర కీ ర్ణ ము లు

౫౧. దంపు దంపనగానె దంపెంతసేపు
ధాన్యరాసులమీద చేయివేసినట్లు
వంట వంటనగానె వంటెంతసేపు
వదినెల్లు మరదల్లు వాదించినట్లు.

౫౨. అత్తపోసినగంజి సత్తువ లేదు
అల్లాడు సిరిపురపు గట్టెక్క లేదు.

౫౩. కోటీవేలా ధనమైన చాలు
గోపికృష్ణుడివంటి కొడుకైనచాలు
లక్షావేలా ధనమైన చాలు
లక్ష్మణదేవరవంటి తమ్ముడైనచాలు.

౫౪. విశాఖపట్నాన వీధిగుమ్మాన
వింతరాచకొడుకు బంతులాడేడు
బంతివెళ్లి పాలకొండ సభలోన పడితే
ఇది యెవరి బంతన్ని వివరించె రాజు
గోలకొండవారి గొలుసుల్ల బంతి
పాలకొండవారి పచ్చల్ల బంతి
శ్రీకాకుళమువారి చిత్రాల బంతి
నెల్లూరువారిదే నీలైన బంతి
బొబ్బిల్లి వారిదే బంగారు బంతి.

౫౫. ఓయి ఓయి ఓయి వడ్డాదిరాజ
పోడిచిగెలిచిన రాజ బొబ్బిల్లిరాజ
బొబ్బిల్లి పోడుగాయె కిమిడి కిందాయె
మాడుగులు మనకాయె మళ్లుమీా రాజ.

౫౬. నరసన్నపేటలో భాగోతులాట
రాజుకూర్చున్నది రత్నాలపీట

పీటకింద మన్నది వరహాలమూట
ఆమూట మాకిస్తె మహామంచిమాట.

౫౭. కొయ్యతోటాకూర కొయ్యక్క చెడెను
కొండంత కాపురం కొండేల చెడెను.

౫౮. చిచ్చెమ్మ చినగాలి పెట్టు పెదగాలి
అయోధ్యవీధుల్లో అణిగె నేగాలి.

౫౯. చలికి వెరిచినట్లు పులికి నే వెరువ
ఆలికి వెరిచినట్లు అమ్మకీ వెరువ.

౬౦. పాటల్ల పచ్చడి రాగాలబుఱ్ఱ
నిత్తెకయ్యాలమారి మొగుణ్ణి పాడింది.

౬౧. కొడుకుల కననివాళ్ళ కడుపేమికడుపు
కులముద్ధరించన్ని కొడుకేమికొడుకు.

౬౨. పిడికెడు వితనాలు మడికెల్ల జాలు
వక్కడే కొడుకైన వంశాన జాలు.

౬౩. కొత్తచింతపండు గోనెల్ల చివుకు
గొడ్రాలివస్త్రాలు పెట్టెల్ల చివుకు
దేవదారుచెక్క చెట్టున్న చివుకు
దేవుడివస్త్రాలు గుళ్లోను చివుకు
రావిచెట్టుచెక్క రంపాన్న చివుకు
రంభచక్కదనము దుఃఖాన్న చివుకు
పాతచింతపండు బస్తాల చివుకు
బాలెంతబట్టలు పసుపున్న చివుకు.

౬౪. నాచేతికోకళ్లు నల్లరోకళ్లు
నేపాడిన అన్నల్లు రామలక్ష్మణులు
రామలక్ష్మణులాల్ల రక్షపతులాల్ల
మీరెక్కగుర్రాలు నీలమేఘాలు
మీచేతి కత్తుల్లు చంద్రాయుధాలు.

౬౫. ఎవ్వరే చుట్టాలు ఎవరు పక్కాలు
ఎవ్వరే మాపాల కలిగి వున్నారు
మాపాల (శ్రీ) వెంకటప్ప వుండగను
మనసులో చింతేల మరిభయములేల.

౬౬. సింహాద్రిఅప్పన్న గుళ్లముందార
పడ్డారె గొడ్రాళ్లు ప్రాణచారమ్ము
ఎందుకుపడ్డారు యేలపడ్డారు
సంతాన మియ్యమని చాలపడ్డారు—సంతాన.
బిడ్డల నియ్యమని ప్రియముపడ్డారు-బిడ్డల.
కుమాళ్ళ నియ్యమని కోరిపడ్డారు - కుమాళ్ళ.
సింహాద్రిఅప్పన్నకు ఏమి లంచమ్ము
గుడితిరుగువస్త్రము గుమ్మడిపండు
దాగళ్ళవడపప్పు చందు బెల్లాలు.

# పాత పాటలు

## రెండో ఖండం

### ౧. జోల పాటలు

౧. ఏటచూలింతమ్మ యేటబాలింత
మునియేటకొడుకు తల్లి అబ్బాయిలక్ష్మి.

౨. నిద్రపో అబ్బాయి నిద్రపోవయ్యా
నిద్రక్కి వేయ్యేళ్లు నీకు వెయ్యేళ్లు
నినుగన్న తలిదండ్రులకు నిండ వెయ్యేళ్లు.

3. లాలిలాలిలాలి లాలెమ్మ లాలి
లాలిలో అమ్మాయి రాణిలా వుంది
లాలెమ్మ గుర్రాలు లంకల్ల మేసు
అమ్మాయి గుర్రాలు పల్లాల మేసు.

౪. చిన్న నా అమ్మాయి చీర కేడుస్తే
నెయ్యవోయి సాలీడ నేత్రానపట్టు
మురుస్తు సాలీడు మూడునెలలు నేసె
అలుస్తు చాకలి ఆరునెలలు వుతికె
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్లుకట్టె.

౫. ఊరిముందర చింత వుగ్రంపు చింత
ఆచింత పూచితే మరిచింత లేదు

మారాజు అబ్బాయిని చేపట్టితేను
మాలక్ష్మి అమ్మాయికి మరిచింత లేదు.

౬. వడ్డివారి బిడ్డల్ని నేనెత్తుకుంటె
వొప్పదే నామనసు ఓవిధములాయ
నాచిన్న అమ్మాయిని నేనెత్తుకుంటే
తనివాయె నామనసు సంతోషమాయె.
వడ్డివారిబిడ్డలార ! ఓ బాలులారా !
దొడ్డయేరొచ్చింది ఒడ్డెక్కరయ్య.
నాఅబ్బి బిడ్డలార ! ఓ బాలలార !
పాలసముద్రం వచ్చె పానుపెక్కండి.

౭. ఓసి ఓసి పిల్లికి సిగ్గేల లేదు
చిన్న నా అమ్మాయికి బుద్ధేల లేదు.
జోలపాడుకృష్ణ జోకొట్టుబ్రహ్మ
పాలియ్యి భద్రకాళి నిద్రపుచ్చు శివుడ.

౮. పూసపాటివారి లోగిళ్లలోను
పురివిప్పి ఆడింది పున్నెంపునెమలి
భారద్వాజవారి లోగిళ్లలోను
పాలుతాగి ఆడేను పట్టి అబ్బాయి.

౯. గుమ్మిడిపూచింది వంగవాలింది
అతిరాచగారాల పండు పండింది
గుమ్మిడి మాయిల్లు వంగ మావంశం
అతిరాచగారాల పండు అబ్బాయి.

౧౦. చిట్టెళ్లు పొట్టెళ్లు కావాలనంటె
శివుడు మాకిచ్చేడు చిన్న బాలలిని
వారికి పాలు నెయ్యి కావాల నంటె
పరమాత్ముడిచ్చేడు పాడావుల మంద
వారికి అన్నమ్ము కావాలనంటె
వరలక్ష్మి యిచ్చింది వరుస గాదెల్లు.

౧౧. ఊళ్లోది బిచ్చమ్ము గుళ్లోదినిద్ర
ఎవ్వారిని పాడుతావు చంద్రశేఖరుడ !
అందరూ కలవాడు అబ్బాయి బిడ్డ
ఆయుష్మంతుడని నే పాడుతాను.

౧౨. చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
తేవె మాఅమ్మాయికి తేనెగాజుల్లు
గుడి తిరిగివచ్చేయి గుడ్లగాజుల్లు
గుత్తాన మాచిన్నఅమ్మి చేతుల్ల
పట్నం తిరిగివచ్చేయి పచ్చగాజుల్లు
పచ్చన్ని మాచిన్న అమ్మిచేతుల్ల
ఊరు తిరిగివచ్చేయి ఉత్తగాజుల్లు
గుత్తాన మాచిన్న అమ్మిచేతుల్ల.

౧౩. చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
తేవె మాఅమ్మాయికి తేనెగాజుల్లు
నవ్వుతూ తొడిగిస్తు నల్లగాజుల్లు
పాడుతూ తొడిగిస్తు పచ్చగాజుల్లు

ఏరియేరి తొడిగిస్తు యెఱ్ఱగాజుల్లు
నిలుచుని తొడిగిస్తు నీలిగాజుల్లు.

౧౪. అందలాలురెండు పొందుబడిరాగ
ఎవ్వారందలమన్ని నేతొంగిచూతు
మావూరిఅందలం మల్లెపూఛాయ
మారాజుఅబ్బాయి అమ్మికాబోలు
ఊరివారందలం ఉల్లిపూఛాయ
ఉత్తముడుచినబాబు అమ్మికాబోలు
కలవారిఅందలం కలవపూఛాయ
కాముడుచినబాబు అమ్మికాబోలు.

౧౫. అందలాలురెండు పొందుబడిరాగ
ఎవ్వారందలమన్ని నేతొంగిజూతు
చుక్కలచంద్రుడే తానుఅబ్బాయి
ననుచూడవచ్చెనే తానుఅబ్బాయి.

౧౬. వేసంగికాలాన విత్తనాలుపోసె
వెన్నుడి కనుదృష్టి మేఘాలపైన
మాయింటిబాబుల్లు మరితిరిగిరాగ
బాబుల్ల కనుదృష్టి తమతల్లిపైన.

౧౭. శ్రీలక్ష్మివరలక్ష్మి లోకచోటగూడి
ఎవ్వారినిపొందమని నన్నడగవచ్చె
"తూర్పుయింట్లోవున్న పెదబాబునుపొందు
పడమటింట్లోవున్న చినబాబునుపొందు
దక్షిణమింట్లోవున్న బుచ్చిబాబును పొందు
ఉత్తరమింట్లోవున్న చిట్టిబాబును పొందు."

౧౮. అన్నల్ల చెల్లెల్లు అలిగితే ముద్దు
పొన్నల్లు, గురివింద పూచితే ముద్దు
అన్నల్ల చెల్లెలే తాను అమ్మాయి
పొన్నల్లు, గురివింద తాను అబ్బాయి.

౧౯. ఓమరిది సిగలోను వెండిమెరిసింది
ఓమరిది సిగలోను పమిడిమెరిసింది
మామరిది సూరన్న కుంచసిగలోను
బంగారుపువ్వుల్ల గుత్తిమెరిసింది
గుత్తివెయ్యిజేసు కుందనంవెయ్యిచేసు
మామరిది సూరన్న మాటవెయ్యిచేసు.

౨౦. ఎవ్వరే మాతండ్రి నేమిఅన్నారు
ఎల్లలేనివీధుల్లో యేనుగన్నారు
మత్తేభమన్నారు మావాడలోను
కూచున్నవారిలో గుమ్మడిపండనిరి
ఆడేటివారిలో అరటిపండనిరి
పాడేటివారిలో పనసపండనిరి.

## ౨. ఆ ట పా ట లు

౨౧. విద్దెంవిద్దెం వరహాలవిద్దెం
విద్దెంచేస్తే గిద్దెడునెయ్యి
తప్పకచేస్తే తవ్వెడునెయ్యి
మళ్లీచేస్తే మానెడునెయ్యి.

౨౨. చల్ల చెయ్యిగొల్లభామ నీ
సందిటిదండలు కదిలేను
వెన్న చెయ్యి అమ్మాయి నీ
వెండిమురుగులు కదిలేను
పాలుతాగు అబ్బాయి నీ
పసిడిమురుగులు కదిలేను.

౨౩. చెప్పుకో చెప్పుకో
చెవులెక్క తీసుకో
మామిడాకిస్తాను మందెట్టుకో.

౨౪. వేడిఅన్నం అప్పడంముక్క తినో తినో
చల్దిఅన్నం ఉల్లిపాయ జుర్రో జుర్రో.
విశాఖపట్నం వీశెడు బెల్లం
నీకోపదలం నాకోపదలం
కళింగపట్నం కాసులపేరు
నీకోపేరు నాకోపేరు
భీమునిపట్నం బిందెలజోడా
నీకోజోడా నాకోజోడా
చెన్నపట్నం చెరుకుముక్క
నీకోముక్క నాకోముక్క.

౨౫. ఉసిరికాయకుండ ఊరుపిండికుండ
మెల్లగా దింపండి బెల్లాపకుండ.

కుండో కుండ.
కుండనిండా కందులు
రంగసాని బొందులు. ౨
పీటమీద పిండి పిసుక్కుతినరా
కొమ్మరటిపండు కోసుకుతినరా. ౩
చెంబు డటుకులు
దమ్మిడిబెల్లం. ౪
అక్కలకర్ర ముక్కాలిపీట
కూర్చోవదినా వదినా వదినా. ౫
సీమమిరపకాయ చిర్రోచిర్రో
పాతగుడ్డ చిరిగితే పుర్రోపుర్రో
దాని మొగుడు దాన్నికొడితే మొర్రోమొర్రో. ౬
చెట్టుకొట్టంగ పాలుకారంగ
నిన్నుకొట్టంగ నీరుకారంగ. ౭
ఉట్టిమీద వూరగాయికుండ
మెల్లిగాదింపరా మేనత్తకొడకా కొడకాకొడకా.
బూడిద గుమ్మడికాయ
బుచ్చెమ్మ తలకాయ
నారదబ్బకాయ
నారమ్మ తలకాయ. ౯

౨౬. సంకురాత్రి పండగొచ్చిం దమ్మలార
చంకలెత్తు గాడం దమ్మలార.

౨౭. యజ్ఞోపవీతం యేగాని బెల్లం
బుజమెక్కి జంజం బుజమెక్కి జంజం.

౨౮. ఒంటిపిల్లి రాకాసాకచోట
ఇద్దరు ముగ్గురు ఒకచోట

౨౯. ఆడతారీ బొమ్మ పాడతారీ బొమ్మ
నక్కేరు చెట్టుకింద బొక్కేరుబొమ్మ
తోలుముక్కవున్న తైతక్క బొమ్మ
బొమ్మా, బొమ్మా – బొమ్మా, బొమ్మా.

30. నాచేతిమాత్ర
వైకుంఠ యాత్ర.

3౧. సూరీతా పిల్లి
మారీతా పిల్లి
పడమటక్కల్లార పారిపోం!

3౨. ఓయి వోయి నాయడా
వంగపల్లె నాయడా
నక్కపాలు పితికినావు
చిక్కాన పోసినావు
జోడు గుర్రమెక్కినావు
బొమ్మలాట లాడినావు.

33. కథ కథ కంగు
మాతాత చెంగు
మానె పోసుకుని దిగమింగు.

## ౩. ప ణ తి పా ట లు

౩౮. ఏరంతవెళ్ళిన్న ఇసుకసన్నంపు
యేరుదాటివచ్చింది యెవరాడపడుచు ?
పచ్చన్నికుచ్చుల పల్లకీయెక్కి
బలగంతోవచ్చింది యెవరాడపడుచు ?
తెల్లన్నికుచ్చుల్ల పల్లకీయెక్కి
తేజముతోవచ్చింద యెవరాడపడుచు ?
నల్లన్నికుచ్చుల పల్లకీయెక్కి
నవ్వుతూవచ్చింది యెవరాడపడుచు ?
ఎర్రన్నికుచ్చుల పల్లకీయెక్కి
.......................
పచ్చన్నికుచ్చుల పల్లకీయెక్కి
బలగంతోవచ్చింది పెద్దన్నవదినె
తెల్లన్నికుచ్చుల పల్లకీయెక్కి
తేజముతోవచ్చింది చిట్టన్నవదినె
నల్లన్నికుచ్చుల పల్లకీయెక్కి
నవ్వుతూవచ్చింది చిన్నన్నవదినె
ఎర్రన్నికుచ్చుల పల్లకీయెక్కి
.............బుచ్చన్నవదినె.

౩౯. వేసంకాలంవచ్చె వలువల్లు చిరిగె
వనిత నీపుట్టింటి వారేలరారు ?

సీతకాలంవచ్చె చీరల్లు చిరిగె
సీత నీపుట్టింటి వారేలరారు
మారుకాలంవచ్చె మడతల్లు చిరిగె
మగువ నీపుట్టింటి వారేలరారు?

3౬. వైశాఖమాసాన వారింటపెళ్ళి
వల్లభుడుఅన్నయ్య పెళ్ళిచేయించె
మిళ్ళి తడియకుండ బొట్టుపడకుండ
నేర్పుతో పెద్దవదినె నేతులొడ్డించె.
అంతకంటె నేర్పరే చిన్నన్నవదినె
ఆకాశాన మిళ్ళి ఆడించిపోయె.

3౭. "పండూగవచ్చింది ఓఅత్తగార!
పిండిక్కి బియ్యమ్ము ఎన్నిపోసేది?"
"కొట్టిక్కి తెచ్చియు వెయ్యవే చేడె
తలగోసి తవ్వెడు పొయ్యిబియ్యమ్ము"
పిండిదంపి వాని అత్త పిలవనంపింద
రానన్ని అల్లుడు రచ్చకొమ్మెక్కె
పిలవనని వానిమామ పీటకొమ్మెక్కె
పోనన్నిపండుగ పొదికట్టియుండె.

3౮. పుణ్యమ్ముఒకచోట బుద్ధివొకచోట
ఆచారమొకచోట ఆజ్ఞయొకచోట
పుణ్యమ్ముమాయింటి పెద్దలకువచ్చు
బుద్ధుల్లు మాయింటి బాలలకువచ్చు

ఆచారంమాయింటి ఆడపడుచులకు
ఆజ్ఞల్లు మాయింటి కోడళ్ళకగును.

౩౯. తొల్లింటి కాలమ్మ దొడ్డకాలమ్మ
అత్తవచ్చి కోడలికి దండమ్మ పెట్టె
"చాలుచాలత్తయ్య చాలత్తగారు!
నీకొడుకు వెయ్యేళ్లు (య్యేళ్ళ?) మొదలుకావాలి
నీకోడలు పట్టంపు దేవికావాలి
నువ్వోళ్లి పంచల్ల పాలుకావాలి."

౪౦. రోటిక్కి మిక్కిలి వాయిపోసేరు
వాడచేడెల్లార! తోడాయి పొండి.
ఓవాడ చేడెమ్మ అబ్బాయిలక్ష్మి
పుస్తెల్లు మెరియంగ పునిస్త్రీ తోడాయె
ఓవాడ చేడెమ్మ అబ్బాయిలక్ష్మి
నానుపేట మెరియంగ నాతి తోడాయె
ఓవాడ చేడెమ్మ అబ్బాయిలక్ష్మి
కంకణాలు మెరియంగ కాంత తోడాయె.

౪౧. వండవు వార్చవు వంటిల్లుచొరవు
వనిత నీ వజ్రాలకొంగేల మాసు?
పణతితో అబ్బాయి పుట్టేడు మొదలు
పణతి అమ్మికొంగు పసుపుల్లమాసు?
కాంతతో అబ్బాయి పుట్టేడు మొదలు
కాంత అమ్మికొంగు కాటుకులమాసు?

చేడెరో అబ్బాయి పుట్టేను మొదలు
చేడె అమ్మికొంగు చేతుల్లమాను.

౪౨. అరణాలులేవు ఆవటి కట్నాలులేవు
అతివ నీ అత్తింట నోరెట్టుకు బతుకు.

౪౩. అళ్లువిసరంగ వచ్చెచుట్టమ్ము
ఆళ్ల తిరగలిచూచి ఆశ్చర్యపడెను
చోళ్లువిసరంగ వచ్చెచుట్టమ్ము
చోళ్ల తిరగలిచూచి చోద్యమ్ముపడెను.

౪౪. చక్కన్నిదానివే చదరాలనీవు
ఒక్కతైవున్నావు ఈఅడవిలోను.

౪౫. వేరింటికాపరం కూతుర కూతుర
వెర్రిమొగుడే కూతుర కూతుర
ఎద్దరి (డి ?) నీళ్లే కూతుర కూతుర
ఏరుపిడకలే కూతుర కూతుర
ఇసకలహొయ్యో కూతుర కూతుర.

౪౬. ఆవాలపప్పు వండ ఓవాదినెనేర్తు
ఆరని అగ్గులుపెట్ట ఓవాదినెనేర్తు
మెంతులు పప్పువండ ఓవాదినెనేర్తు.

౪౭. కోడలా కోడలా కొడుకుపెళ్లామ
కొడుకు వ్రాళ్లో లేడు మల్లె లెక్కడివి?

## ౪. ప్రాపంచికోక్తులు

౪౮. ఒంట పుట్టిందమ్మ వుగ్రంపు తెగులు
అడవిమందులుతిన్న అది కుదురదాయె.

౪౯. అమ్మపెట్టిన్న అన్నమ్ముకన్న
భార్యపెట్టిన్న బలుసాకుమేలు.

౫౦. పెళ్లామంటే బెల్లమురా
తల్లి అంటే దయ్యమురా.

౫౧. అత్తలేనికోడ లతిముద్దరాలు
కోడలులేనత్త గుణవంతురాలు.

౫౨. హింసచేసినవాడె హింస తా బొందు

౫౩. అడుచుగోనుపాడుచుగోను ఆడవారివంతు
కూచునిభోంచెయ్య మొగవారివంతు.

౫౪. దంచక్కనలగవే ధాన్యరాసుల్లు
వంచక్కవంగరే వనితకోడళ్లు.

౫౫. ముద్దుచేసిన కుక్క మూతినికరచె
చనువుచేసిన ఆలి చంకనుయెక్కె.

## ౫. ప్రకీర్ణాలు

౫౬. కన్నతల్లినిబోలలేరు చుట్టాలు
పట్టుచీరను బోలలేవు చీరల్లు

పరమాత్మ నిను బోలలేరు చుట్టాలు
వెల్లచీరను బోలలేవు చీరల్లు
వేదమ్ము నినుబోలలేవు చదువుల్లు.

౫౭. తాతగారింటనే తూతూలపెళ్లి
బూరిముక్కడుగుతే బుగ్గ పొడిచేరు
గారిముక్కడుగుతే కసరికొట్టేరు
అరిసిముక్కడుగుతే అదిమి తన్నేరు.

౫౮. ఏకేకు బార ఎల్లుండి సంత.

... ... ... ... ...

౫౯. రోక లెత్తలేను రో లెత్తలేను
చేమపూ కడియంపు చెయ్యెత్తలేను.

౬౦. నో రెంగిలాయెనే చెయ్యెంగిలాయె
చెయ్యికడుగ నీళ్లియ్యి చెల్లెలమ్మాయి.

౬౧. కూకుంటె లెగలేడు కూరాకు తెంపలేడు
కొట్టొస్తె డోలప్ప సిగ్గొస్తది.

౬౨. కూడు తింటావా తమ్మా?
కూకుండే వున్నా నమ్మా.
అంబలి తింటావా తమ్మా?
అమిరే వున్నా నమ్మా.
గడ్డి కోస్తావా తమ్మా?
గడియుండోస్తానమ్మా.

౬౩. గిద్దె పెసరాపప్పు గిన్నెతో నే వండి
వద్దు వద్దనగానె వడ్డించి వెళుము.
పొద్దుటన్నములోకి పొలములోవెళ్ళి

… … … … …

౬౪. చిన్నారి పొన్నారి చిన్న కోవెలవు
చిగురుమామిడి కింద చిన్న కోవెలవు.

… … … … …

౬౫. చిమడకే చిమడకే ఓ చింతకాయ
నువ్వెంత చిమిడినా నీపుల్ల పోదు
ఉడకకే ఉడకకే ఓ వుల్లిపాయ
నువ్వెంత వుడికినా నీకంపు పోదు.

౬౬. వదినగారలు మీరు వాసి గలవారు
వండబోయినచోట కుండ నాకేరు.
బావగారలు మీరు భక్తిగలవారు
నిండివున్న సభలోను పిండిబుక్కేరు.

… … … … …

౬౭. ఆకలికి వేళాయె అమ్మ తలుపాయె
అమ్మగారింటికే పోను బుద్ధాయె.

౬౮. పనంటె నావొళ్ళు భారకిస్తుంది
భోజనమంటె నావొళ్ళు పొంగిపోతుంది.

౧౯. మొండికెత్తినదాన్ని మొగుడేమిచేసు
లజ్జమాలినదాన్ని రాజేమిచేసు
సిగ్గుమాలినదాన్ని శివుడేమిచేసు.

౨౦. అమ్మనాడెరగనే వుయ్యాల
అబ్బనాడెరగానే వుయ్యాల
మొగుడునాడెరగనే మోకులుయ్యాల.

౨౧. చూచీది కళ్ళమ్మ వాచీదిమొహం
నీకేమికలుగునే నిర్భాగ్యురాల.

౨౨. ఏకాసివచ్చింది రాకాసిలాగ
బ్రాహ్మల్లపాలింట పెనుభూత మాయె.

౨౩. తోడికోడలు నాకు తోడాయె నమ్మ
దొంగతిండ్లకు మాకు సందాయె నమ్మ.

౨౪. ఊరు మంచిదని వుబ్బకురా అబ్బ
ఊళ్ళోను దీపమ్ము పెట్టిన్నదాక
ఆలిమంచిదని వుబ్బకురా అబ్బ
ఆయింటికాపరం చేసిన్నదాక.

౨౫. సంపత్తుచేతనే చావతీరాదు
యముడిక్కి చెప్పండి రాతీరదాని.

౨౬. చుక్క తెల్లవారె తూర్పు తెల్లవారె
తులసెమ్మ పెనిమిటిని మేమన్ని లేపు.
"కలవలచెర్లోకి నీళ్లు చేరేయి
కాళ్లుకడగ మీకు వేళాయె లెండి.

మొగ్గల్ల చెర్లోకి నీళ్లుచేరేయి
మొహముకడుగ మీకు వేళాయెలెండి.”

౨౭. బూరుగ పూసింది బారువనంలో

... ... ... ...

౨౮. కోటసింగరాజు మాటవాసికైన
గంగమాంబచేత గుణుతికెక్క
గంగమాంబ ఎంతొగయ్యాళియైతేను
సింగరాజు యేమి చేయగలడు.

౨౯. వంకాయ వండేను వరికూడు వండేను
తినమనీ చెప్పవే తడికా తడికా,
వగలాడి మాటలకు వళ్లంతా మండింది
వద్దనీ చెప్పవే తడికా తడికా,
పట్టుచీర తెచ్చేను పెట్టిలోను పెట్టేను
కట్టుకోమని చెప్పవే తడికా తడికా.

... ... ... ... ...

౩౦. గడపలలోకల్ల యేగడప తీరు
మహాలక్ష్మి వసియించు మాగడప తీరు.
వీధులలోకల్ల యేవీధి తీరు ?
విద్వాంసులు నడచిన్న మావీధి తీరు,
అరుగులలోకల్ల యే అరుగు తీరు ?
పండితులు కూచున్న మా అరుగు తీరు.

౨౧. వానదేవుడ నీకు వరస చెల్లెలిని
వర్షాలు కురిపించు వరి మళ్లలోను
కురిసింది మావూర కుంభవర్షమ్ము
పండేయి మాచేలు పల్లంపుభూమి
నూర్పించి తెచ్చేరు నూరు గరిసెల్లు
పండించి తెచ్చేరు పంటకావుల్లు
ఎక్కలేనిగట్టు దిగలేని మెట్టు
చూలింతలు పోసేరు చుక్కల్లపొడుగు
బాలింతలు పోసేరు పర్వతాలపొడుగు
నూనెతో పులగాలు మాయెడ్లు మేసె.

౨౨. పన్నెండుధాన్యాలు వానదేవుడా
పంటమీద పండాలి వానదేవుడా
పన్నెండుధాన్యాలు...
పంటచేలుపండాలి...
మాకడుపు నిండాలి...
పేదసాద బతకాలి...
కూలినాలి దొరకాలి...
పారిపోయిన బావ...
పరిగెడుతు రావాలి...
ఊరికెళ్లిన బావ...
ఊరికురికి రావాలి...
తల్లిలేని బిడ్డల్లు...

తల్లాట పడతారు...
తండ్రి లేని బిడ్డల్లు...
తల్లాట పడతారు...
పసిబిడ్డ బాలకులు...
తల్లాట పడతారు...
చేటంత మబ్బుపట్టి...
చెరువంత నిండాలి...
తూరుపున మబ్బుపట్టి...
తుళ్లి తుళ్లి కురవాలి...
పడమటను మబ్బుపట్టి...
పట్టి పట్టి కురవాలి...
ఉత్తరాన్ని మబ్బుపట్టి...
ఉరిమి మెరిమి కురవాలి...
దక్షిణాన్ని మబ్బుపట్టి...
జల్లు జల్లున కురవాలి...
ఈగతల్లి నీళ్లాడి...
వీధి వీధి నిండాలి...
దోమతల్లి నీళ్లాడి...
దొడ్డెల్ల నిండాలి...
పాముతల్లి నీళ్లాడి...
పంటచేల్లో తిరగాలి...
కప్పతల్లి నీళ్లాడి...

కడవ పంచేల కుయ్యాలి...
కురవాలి కురవాలి...
కుంభవృష్టి కురవాలి...
డబ్బుకు తవ్వెడు బియ్యం...
మనిషికిద్దరు పెళ్లాలు...
వానొస్తె వణుకైన...
కురవాలి కురవాలి...
మూడురోజుల యెండ...
ముప్పైరోజుల ముసురు...

నా 3 [మోచేటి పద్మమ్మ నోములోని సాయంకాల వర్ణనం.]

మోచేటిపద్మమ్మ పట్టేటివేళ
మొగ్గల్లు తామర్లు పూచేటివేళ
బీరాయిపువ్వుల్లు పూచేటివేళ
బిందెల్ల వుదకమ్ము తెచ్చేటివేళ
కాకరాయిపువ్వుల్లు పూచేటివేళ
కడవలతొవుదకమ్ము తెచ్చేటివేళ
గుమ్మడీపువ్వుల్లు పూచేటివేళ
గుండిగలతొ వుదకమ్ము తెచ్చేటివేళ
ఆనపాయిపువ్వుల్లు పూచేటివేళ
అటిగలతొ వుదకమ్ము తెచ్చేటివేళ
చిక్కుడాయిపువ్వుల్లు పూచేటివేళ
చిప్పల్లగంధమ్ము తీసేటివేళ

ఆవులు గోవులు వచ్చేటివేళ
అంబోతు రంకెలు వేసేటివేళ
సంధింటిదీపమ్ము పెట్టేటివేళ
చాకింటి మడతల్లు తెచ్చేటివేళ
అన్నల్లందలా లెక్కేటివేళ
బావల్లు పల్లకీ లెక్కేటివేళ
తమ్ముల్లు తాంబూలం వేసేటివేళ
మరుదుల్లు మరిజాద మాడేటివేళ
కూతుల్లు గుండిగలు దింపేటివేళ
కోడల్లు కొటుపనుపు కొట్టేటివేళ
చెల్లెల్లు చేమంతులు ముడిచేటివేళ
వదినెల్లు వంటల్లు వండేటివేళ. *

* పాతపాటలు – రెండోఖండం 'భారతి' 1931 అక్టోబరు, నవంబరు, డిశంబరు, 1932 జనవరి, ఫిబ్రవరి సంచికలలో అచ్చయింది.

# పాత పాటలు

## మూడో ఖండం *

౧. ఇసుకలో ఆడేటి కుసుమసిరి బాల
ఆబాలపేరేమి ఆనవాలేమి
ఆనవాలు అంబరస పేరు బాలయ్య.

౨. రమణయ్యచేతుల్లోది వజ్రాలగిలక
చూచిరా ఆ మెలక చూరున్నపెట్టె
వాసాలబారేటి మీసాలమెలక
పాపకారిమెలక పారెయ్యిగిలక
దోసకారిమెలక దులిపెయ్యిగిలక.

౩. పంచదారకుప్ప పాలమీది తెప్ప
మాకు మా వెంకట రమణయ్య ముద్దు
వరహాలకుప్పందు వచ్చె ధనమందు
మామసత్యం తెచ్చె మాణిక్యాలకంటె
అత్తసీతమ్మ తెచ్చె అద్దాలఅంగి
వెన్నారిముద్దందు వెలగపండందు.

౪. వెలదిరో! వెంకటరమణ మెవరిపట్టందు
కాంతరో! వెంకటరమణ కన్నతల్లందు

---

* ఈ పాతపాటలు నేను సికిందరాబాదులో ౧౯౩౧ వ సం॥ ఏప్రిల్ మాసంలో సేకరించాను.

ఇచ్చిన దేవునిబోలు ఈశ్వరునిబోలు
బ్రహ్మదేవునిబోలు బాలల్లబోలు.

౫. పెదమామ తెచ్చిండు పెంచపులిదండ
నడిపిమామ తెచ్చిండు నాగభూషణాలు
చినమామ తెచ్చిండు చిలకల్లతొట్టె
అవి మా వెంకటరమణకు అమరుకడియాలు.

౬. మందలకు పోవయ్యా మామ తరిణయ్యా
మరువక తేవయ్యా మచ్చావుపాలు
అవి తెచ్చిమా రాజు వెంకటరమణకు పోసె

౭. వెన్నపెట్టి నే కొందు వెండిపుస్తకము
వెన్నుడుపెద్దన్న వేదమ్ముచదువు
పాలుపెట్టి నే కొందు పైడిపుస్తకము
బాలుడు నడిపన్న భారతము చదువు
గరుజుయిచ్చి నే కొందు గంటల్లబండి
గానుడు చిన్నన్న గంట కట్టేడు.

౮. నిద్రవికన్నుల్లు మబ్బుమొగముల్లు
నిద్రపో బలభద్ర రాజకొమార
నిద్రకు నూరేళ్ళు నీకు వెయ్యేళ్ళు
నిన్నుగన్నతండ్రికి నిండ నూరేళ్లు.

౯. తాత ముత్తవ్వాల తలిదండ్రులబోలు
తలిదండ్రి గారాబాన ఆడు వెంకటరమణా.

౧౧. తాతగారియింట్లో తా నాడబోయె
తాతతో తాఆడు వేంకటరమణ
శ్రీమద్దికాయల్లు శ్రీల లాటాలు
చిలుకల్లు యేమనెనో చిన్నబోయేను
హంసల్లు యేమనెనో చిన్నబోయేను
హంసలతో వనమందు ఆడనేవద్దు.

౧౧. పుక్కిళ్ళు సన్నాలు భుజకీర్తులు
చెక్కిళ్ళు సన్నాలు చెవుల గున్నాలు
కాళ్ళను సన్నాలు గజ్జలకడియాలు
వేళ్ళను సన్నాలు ముద్దుటుంగ్రాలు.

౧౨. శ్రీరంగం వెళ్ళేటి చిన్నవైష్ణవులు
అదిగో చూడరయ్యా గాలిగోపురము
గుళ్లోను చూడరే రంగనాయకులస్వామి.

౧౩. లాలెమ్మ రత్నాలు కీలెమ్మ జడలు
కీలెమోతుపుసరులు వెంకటేశకురులు
మెడనిండ ముత్యాలు మేలు పతకాలు
తలనిండపుట్టు వెంట్రుకలు తనరారురా(రే?) క.
అష్టరావిరేక నొసలు మెరియుంగ.

౧౪. జోలలకు చినపండు నీ కరటిపండు
నినుగన్నవారికి పాలపండేను
పాలపండూ తిన్నపాలరుగ వన్ని
వాహైన నూరి పొయ్యి ఓ గౌరిదేవి

వాము బాలయ్యకు వోంకార మన్ని
ఇక సర్వకాయమియ్య ఓ సఖియ దేవి
సర్వకాయం మాబాలయ్యకు సంతోష మన్ని.

౧౫. తంగేడుచెట్టుకే తూగుటుయ్యాల
ఉయ్యాలపట్టుక ఊగె బాలయ్య
తంగేడు చెట్టుకింద వంగి ఆడివచ్చె
హంసల్లు కోయిల్లు అవి లక్ష వేలు
చిలకాలు పావురాలు శివ ! లక్ష వేలు
శ్రీరాముడుండంగ మనకేటి భయమె
హనుమంతు డుండగ మనకేటి భయమె.

౧౬. ఓచిన్నికుమార ! నే కొందు నీకు
పుట్టుగజ్జలు కొందు పులిగోరుకొందు
పున్నయ్య మీనాన్న వచ్చె వూరుకుండు
కాళ్ళగజ్జలుకొందు, కంటె, కమలాలు కొందు
కౌసల్య మీఅమ్మ వచ్చె యేడువకు
చీదర్లు చెయ్యకు చిన్నిబాలయ్య
చీదర్లు నినుబాసె సిరులు నిను బొందె
శ్రీలక్ష్మి ఊయంగ ఊగు ఉయ్యాల
ఉయ్యాల నీకమిరె వుగ్గు నీకమిరె.

౧౭. ముత్తెములబాలయ్య ముంగిటాడంగ
ముంతమామిడన్ని ముసిరె చిలకాలు
పగడములబాలయ్య పందిటాడంగ

పండుమామిడన్ని బ్రమిసె చిలకాలు
వజ్రములబాలయ్య వాకిటాడంగ
వట్టిమామిడన్ని వచ్చె చిలకాలు.

౧౮. బుద్ధిగలవాడమ్మ చిన్నినాయన్న
భుజాన వేసిరే భుజకంఠమాల
వాసిగలవాడమ్మ చిన్నినాయన్న
వాసియని వేసేరు వనమాలపేరు.

౧౯. కాకర చెట్టుకు కాయలందమ్మో
బాలయ్య చెవులకు పోగులందమ్మో

౨౦. తుమ్మెదనీకళ్ళు దూలాలమీద
బాలయ్యనీకళ్లు మగనాళ్ళమీద.

౨౧. ఊరికి ఉయ్యాల అమ్మవచ్చింది
కొమాళ్ళుగలతల్లి కొనరెవుయ్యాల
కొడుకులుగన్నచేడె కొనవెవుయ్యాల
ఏమిపెట్టి కొందు వెండివుయ్యాల
చేటకొంగునచేరెడు ముత్యాలు పోసి
ఉయ్యాలనేకొందు వుయ్యాగ కొందు
ఉయ్యాలచేరుల్లు వుత్తగదములు

౨౨. చిరిదిండికాడమ్మ చిన్నిబాలమ్మ
పట్నానతేరమ్మ వుట్నాలగోనె.

౨౩. ముద్దుమొగమున ముచ్చటలు ఆడె
ము(మ?)వ్వంపుదేవుడవు నీవు నా బాల
తాతముత్తవ్వలబోలు తలిదండ్రులబోలు
అయ్యాముత్తవ్వలబోలు అయ్యల్లబోలు
బాలయ్య ముద్దుల్లు మద్దికాయల్లు
మద్దికాయలు ముద్దు మాటల్లు ముద్దు
మామల్లచంకను బాలయ్య ముద్దు.

౨౪. నాచిన్న బాలయ్య నీ చిన్ని మొగము
నీచిన్ని మొగమందు నిమ్మపండందు.

౨౫. వెన్నకు యేడ్చేవు యెత్తేవు గిన్నె
వెల్లావు పంపుదురు మీఅమ్మ తాత
పాలకు యేడ్చేవు పట్టేవు గిన్నె
పాడి బర్రెలపంపు మీఅమ్మ తాత.

౨౬. గానువెనక మోత యెవరిది మోత
చిన్ని నాబాలయ్యది గజ్జెల్లమోత
ఊరువెనక మోత యెవరిది మోత
చిన్ని నా బాలయ్యది వుంగ్రాలమోత.

౨౭. పాలియ్యవుకదాయె పండబెట్టవు కదాయె
ఉగ్గుపొయ్యవు కదాయె వూపవు కదాయె
నీళ్ళు చాలపోసి నీలంగి తొడిగి

నిమ్మపళ్ళు వడికట్టి తిరిగి రమ్మనుము
చిన్ననాటివి రెండు చీటి అంగీలు
జీడిపళ్ళు వడికట్టి తిరిగి రమ్మనుము
చిలుకల్లు తిన్నారె జీడిపళ్ళు
హంసల్లుతిన్నారె అంజూరపళ్ళు
హంసతిన్నపండు హండాలుకట్టి
చిలుకతిన్నపండు చిక్కానపెట్టు.

---

## ల ఘు టీ క

### మొ ద టి ఖ ం డ ం

౨. వింజరపురేవు = కాకినాడ సమీపంలోఉంది. వాడ = ఓడ. ౩. మాడ = వరహాలోసగం లేక రెండురూపాయిల విలువ బంగారు నాణెం. ఇప్పుడు వాడుకలోలేదు. ౪. సూటిగుఱ్ఱాలు = సమానమైన గుఱ్ఱాలు (సూడు=వైరం, పగ). లక్కపావా=లక్కపూతగల పాంకోడు. ౯. ఏకదివాణం=ఒక్కదివాణం. ౧౩. విడిమట్టు(వ్యు. విడిది+పట్టు)=విడిది ఇల్లు. ౧౬. గూడొగ్గుట=పిట్టలనుపట్టు పంజరంవేయుట. ౧౭. పణతి=స్త్రీ. ౨౪. బోరుతలుపు = పెద్దరెక్క తలుపు. ౨౬. రేక = గీత. ౨౮. వాడ = వీధి. ౨౭. రెండు, నాలుగు, ఆరుచరణాలలో క్రియ ప్రాసంచూడండి. ౨౯. బలగం = బంధువర్గం. ధరణిచేరు, భూమిచేరు = ఇవి ఉయ్యాలచేరుల పేర్లయుండవచ్చు. ౩౨. మావి = మా యొక్క. ౩౬. వద్ది (వద్దిక?) = భయభక్తులు కలిగియుండుట. ౪౧. ఉప్పాక=ఒకగ్రామనామం. ౪౨. పార్వా=పావురం. ౪౭. వల్లభుడు = ఒకని నామం, సమర్త కట్నం = రజస్వలయిన కన్యకు పెళ్ళికొడుకువారు తెచ్చేకట్నం. ౫౦. అణుప్పసుపు = ఒకరకంపసుపు. గోవపూవు=గోగుపువ్వు? కొట్టుపసుపు = ఉడికించిన పసుపుకొమ్ములు రోటిలోదంచినగుండ. ౫౧. ఈ 'సిరిపురం' విశాఖపట్నం జిల్లాలోది. చదరాలు=చదురాలు; సమర్థురాలు. శాంత=ఒకమనిషిపేరు. ౬౩. రక్షపతి = రక్షణము చేయురాజు. ౬౫. ప్రాణాచారం = సాష్టాంగం; చండుబెల్లం=(వ్యు. చుండు+బెల్లం) ఒకరకంబెల్లం.

## రెండో ఖండం

[illegible] మునిఏడు = తొలియేడు; మొదటిసంవత్సరం. ౪. నేత్రాన పట్టు (వ్యు. నేత్రముపట్టు?) = తెల్లనిపట్టు. ౫. ఉగ్రంపుచింత (ఉగ్రం చింత)=వెయ్యేళ్లు భూతాలుగల చింతచెట్టు. ౬. వడ్డివారు=వృద్ధులు. దొడ్డయేరు = పెద్దయేరు. ౮. పున్నెంపు నెమలి = ఒకరకం నెమలి. ౧౦. చిట్టీళ్ళు=చిట్టివాళ్లు; పొట్టీళ్లు=పొట్టివాళ్లు. ౧౨. గుడ్లగాజు = ఒక రకంచేతిగాజు. ౧౪. పొందుబడి = జోడుగా. ౧౬. వెన్నుడు = ఒకమనిషిపేరు (చూడండి మూడోఖండం 2 పాట). ౨౯. పమిడి = బంగారం; కుంచసిగ (వ్యు.కుంచెసిగ?)=తలవెంట్రుకలనమర్చు ఒకరకం పద్ధతి. ౨౫. కొమ్మరటి = ఒకరకం అరటి. ౨౮. ఒంటిపిల్లి = ఒంటిపల్లి. ౨౯. బొక్కెరబొమ్మ = ?. ౩౨. సూరీతాపిల్లి (వ్యు. చూలెంతపిల్లి ?) ౩౪. మారుకాలం = మిగతాకాలం. ౪౩. ఆళ్ళు = ఒకరకంధాన్యం. ఆళ్ల తిరగలి = ఇదొక కొయ్యతిరగలి. చాలా పెద్దదిగా ఉంటుంది. ఆళ్లే చోళ్ళతిరగలికూడా. ౪౫. ఏరుపిడకలు = పొలంమీద దొరికే ఎండిన పేడకళ్ళు. ౪౮. ఉగ్రంపు తెగులు = పెద్దవ్యాధి. చూ. ఉగ్రంపు చింత. ౫౯. చేమపూడియం = ఒకరకంచేతి కడియం. ౬౫. పుల్ల = పులుపు. ౭౧. పోకులుయ్యాల = చెట్లకి తాడువేసి తయారుచేసే ఉయ్యాల. [illegible]డుగైనతోట.

## మూడో ఖండం

[illegible] = ? అంబరస = (ఇంటిపేరేమో ?) ౫. తెచ్చిండ్రు = తెచ్చాడు; నాగభూషణాలు = నాగబంధపు చెవుల పోగులు. పరిచెపులదండ = పింఛముగల ఒక ఆభరణము. నడిపిమామ = మధ్యమామ. ౭. నడిపన్న = మధ్యన్న. గరుజు = ఇదొక నాణెం ? 'గరుజు' మాటకి అవసరం, గర్వం అనే అర్థాలు గోదావరి కృష్ణాజిల్లాలలో వాడుకలో ఉన్నాయి. ౧౧ గున్నాలు = (కుండనాలు?) మోతుపు సరులు = ? ౧౪. సర్వకాయం=ఒకరకంకాయం (బాలెంతలుతినేది ?) ౧౬. పుట్టుగజ్జలు = ఒకరకం కాలిగజ్జెలు? ౧౮. భుజకంఠమాల = ఒక ఆభరణం. ౨౦. పుట్నాలు = బొరుగులు. ౨౭. హండా = పెద్ద గంగాళం.

---